

"PRASANTHI NILAYAM"
Prasanthinilayam Post Office
Puttaparthi, Anatapur Dist.
A.P. 515134
INDIA.

18th April, 1986.

Editor,
"Sri Vani"

Accept Blessings.

The "Sri Vani" is being received. The material moral and spiritual blossoms which it offers are spreading holy fragrance in the society. Magazines of this type are greatly needed for today's society. It is not that easy to run a magazine, these days. Prices have risen sky-high. Therefore, may you succeed with some effort in overcoming all obstacles and in publishing the magazine continuously for-years.

I find you are having financial troubles, in connection with this magazine. You have involved yourself in sundry loans also. With the Prasadam given herewith, - fifteen thousand flowers - free yourself from loans, and there-after, may you, with renewed vigour and joy, offer the magazine in time to the people.

With Blessings
Sri Sathya Sai

కృ త జ్ఞ తా భి వం ద న ము లు

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు దివ్యచక్షువులతో సందర్శనం గావించి "శ్రీవాణి"ని ఆశీర్వదిస్తూ 15 వే
ప్రేమాత్మక పుష్పములను ప్రసాదించి, కరుణా కటాక్షములను ప్రసరించినందులకు ప్రణమిల్లి ప్రపన్నుడనగుచున్నా న
శ్రీ బాబావారికి నా మనఃపూర్వక కృతజ్ఞతాభివందనములు.

భవదీయుడు

కొమరగిరి కృష్ణమోహనరావు

సంపాదకుడు "శ్రీవాణి"

# జులై - 1986

సంపుటి : 2

సంచిక : 7

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి క్రిష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521 001
ఫోన్ : 2818



చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED &
PUBLISHED BY

**Komaragiri
Krishna Mohan Rao**

Printed at
SPANDANA PRINTERS
MACHILIPATNAM


## విషయసూచిక

శ్లో॥ ప్రాతర్వైదిక కర్మత స్తదను సద్వేదాన్త సంచిన్తయా
పశ్చాద్భారత మోక్షధర్మమననాత్ వాసిష్ఠ రామాయణాత్
సాయం భాగవతార్థ దివ్యకథయా రాత్రౌ నిదిధ్యాసనాత్
కాలో గచ్ఛతి నశ్శరీర భరణం ప్రారబ్ధ కంఠార్పితమ్ ॥

మనస్సునుబట్టి మనిషి మంచి చెడుల నిర్ణయం జరుగుతుంది. మనసులో అనుక్షణం పుట్టే భావాల కంతు లేదు. అదే బంధ మోక్షాలకు కారణం కూడా. ఇలాంటి మనసులో కావలసినంత మాలిన్యం పేరుకొని వుంటుంది. మలిన మనస్సులో భగవంతుడు గోచరించటం కష్టం. అంతేకాక మనిషి తీవ్రంగా ప్రయత్నించినా ఏకాగ్రత కుదరదు. ఇక శ్రేయస్సెలా కలుగుతుంది ?




అందువలన ముందు మనస్సును శుద్ధం చేసుకోవాలి. దీని నిండా దుర్వాసనలు నిల్చి వుంటాయి. ఎప్పటి కప్పుడు రాగిచెంబు తోమితేగాని ప్రకాశింపనట్లు మనస్సును కూడా తోమకపోతే ప్రకాశింపదు. రాగి చెంబుకు చిలుము పట్టినట్లే మనసుకు దుర్వాసనలు పట్టాయి. దాని చిలుం చింతపండుతో పోతుంది. మరి దీని దుర్వాసన లెట్లాపోతాయి ?

దుర్వాసనలు తొలగిపోయి మనస్సు శుద్ధం కావటానికి జగద్గురువులు ఆదిశంకరులు ఉపాయం చెప్పారీ శ్లోకంలో.

శరీరం ప్రారబ్ధ కర్మ వల్లనే యేర్పడుతుంది. ప్రారబ్ధం అనుభవిస్తేగాని నశించదు. అప్పుడే యీ శరీరమూ పోతుంది. ప్రారబ్ధ కర్మ ననుభవించటానికి వచ్చిన యీ శరీరం ఎంతవరకుంటుందో అంతవరకూ వుండే కాలాన్ని జీవితకాలం అంటాం. ఇప్పటి ప్రారబ్ధం మనిషి మెడకు తగుల్కొన్నది.

అందువల్ల జీవితకాలంలో మనం కొన్ని విధుల్ని సక్రమంగా పాటిస్తే దుర్వాసనలు పోయి చిత్తశుద్ధి కలిగి శ్రేయస్సును పొందగలుతాం.

ప్రతిదినం ఉదయాన మన వర్ణాశ్రమ ధర్మాల ననుసరించి సంధ్యావందనాది వేదవిహిత కర్మలు చేయాలి. ప్రాతఃకాలం అలాంటి అనుష్ఠానంతో గడపాలి. దాని తర్వాత వేదాంత విచారంలో ఉండాలి. వేదాంతమంటే వేదాల సారమైన ఉపనిషత్తులు. ఉపనిషత్తులు శ్రేయోమార్గాన్ని వివరించాయి. భగవత్తత్త్వం వాటిల్లోనే వివరింపబడింది. కనుక ఉదయాన అనుష్ఠానం ముగించుకొని కొంతసేపు పరతత్త్వాన్ని గురించి ఆలోచించటం మంచిది.

మధ్యాహ్నం భోజనమైన తర్వాత నిద్రపోకూడదు. అప్పుడు భారతం, యోగవాసిష్ఠం చదువుకోవాలి. వాటిల్లో మోక్షం, ధర్మం వాటి స్వరూప స్వభావాలు చర్చించబడినాయి కనుక మనం వాటిని తెలుసుకొని మననంచేసుకోవాలి.

ఇక సాయంకాలమయ్యేసరికి సంధ్యాదులు ముగించుకొని రాత్రి భోజనం చేసేలోగా భాగవతం పఠించాలి. భాగవతంలో పరమాత్మయొక్క కథలనేకం దివ్యంగా వర్ణింపబడినాయి. అవి తెల్సుకుంటూ కాలం గడపాలట.

రాత్రి భోజనం కాగానే పడుకోరాదు. అప్పుడు పగలంతా అధ్యయనం చేసిన వివిధ విషయాలు కాసేపు తిరిగా ఆలోచనలోకి తెచ్చుకొని మనసుకు పట్టించుకోవటం మంచిది.

ఈ విధంగా మనం సూర్యోదయంనుంచి రాత్రి పడుకొనేంతవరకు ఆచార్యశంకరులు బోధించిన యీ ప్రణాళిక నవలంబిస్తే మనస్సులోని దుర్వాసనల ప్రభావం వుండదు. అవి సంపూర్ణంగా తొలగిపోయి చిత్తశుద్ధి కలుగుతుంది.



# సంపాదకీయం

## ప్రవేశ పరీక్షలు – ట్యూషన్లు

“ అంతం కాదిది ఆరంభం ” అని విద్యాశాఖామంత్రి శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడు ప్రయివేటు ట్యూషన్ల మీద దాడిని గురించి ప్రస్తావిస్తూ ఘనంగా చెప్పారు. వారి ఆశయ ఆదర్శాలు ఉన్నతమైనవే అయినప్పటికీ, వారు ఆరంభించిన సమర సమయ లగ్నం మాత్రం సరైనది కాదని చెప్పవలసివస్తున్నది. వీరి చర్య వలన నష్టపోయినది విద్యార్థులు మాత్రమే. వృత్తి విద్యా కోర్సుల ప్రవేశ పరీక్షల (Entrance Examinations) సమయంలో ఇటువంటి చర్య గైకొనడం అనాలోచితం. అంతేకాదు సమ్మె తరువాత ఇటువంటి చర్య గైకొనడంతో, అధ్యాపకులు సహితం, ఇది కేవలం కక్ష సాధింపు చర్యేనని భావించడానికి అవకాశం ఏర్పడింది. అధ్యాపకులు ప్రయివేటు ట్యూషన్లు చెప్పరాదని రాష్ట్ర ప్రభుత్వం మూడు సంవత్సరాల క్రితమే ప్రకటించినప్పటికీ, ఇప్పటివరకూ మెదలకుండా వుండి, హఠాత్తుగా విద్యా సంవత్సర చివరిదశలో అధ్యాపకుల ట్యూషన్ల మీద, ట్యుటోరియల్స్ మీద దాడులుచేయడం అత్యంత ఆశ్చర్యకరం. ఈ చర్య సంవత్సర ఆరంభం నుండే తీసుకొని వుంటే బాగుండేది. ప్రవేశ పరీక్షల కోచింగ్ విషయంలో ప్రత్యామ్నాయం ఏర్పాటు చేయకుండా హఠాత్తుగా ఈ చర్య గైకొనడం వలన విద్యార్థుల భవిష్యత్తు ఈ సంవత్సరం దెబ్బ తిన్నది. ప్రవేశ పరీక్షలు పెట్టడం వలన కాలేజీ విద్యమీద విద్యార్థులకు అసలే ఆసక్తి తగ్గింది. ఎన్ని మార్కులు తెచ్చుకున్నా ఏమి ప్రయోజనమని విద్యార్థులు భావిస్తున్నారు. అధ్యాపకులకు కూడా తరగతుల బోధన విషయంలో శ్రద్ధ తగ్గింది. ప్రయివేటు ట్యూషన్ల మీద మోజు పెరిగింది. ప్రవేశ పరీక్షలకు హాజరయ్యే విద్యార్థుల సంఖ్య పెరిగింది. ట్యుటోరియల్స్ విపరీతంగా పెరిగాయి. ఈ పరిణామాలన్నిటికీ ప్రభుత్వ అనాలోచిత విధానములే కారణములైనాయి. కనీసం వచ్చే సంవత్సర ఆరంభంనుండైనా సరియైన, సముచితమైన నిర్ణయం గైకొని విద్యార్థుల భవిష్యత్తుకు ఎవ్విధమైన హాని జరుగకుండా ప్రభుత్వం అవసరమైన చర్యలను గైకొనాలి. అసలు వృత్తి విద్యా ప్రవేశ పరీక్షలు రద్దు చేయడం సముచితం. అటుల వీలుకాని పక్షంలో వృత్తి విద్యా కోర్సులకు వెళ్ళే విద్యార్థులకు ప్రభుత్వమే ప్రత్యేక శిక్షణ తరగతులను ఉచితంగా నెలకొల్పాలి. అది చేయకుండా ప్రయివేటు ట్యూషన్లు, ట్యుటోరియల్స్‌పైన దాడులు కొనసాగించడం ఏ మాత్రం విజ్ఞత అనిపించుకోదు. గాలి వారి చర్య “ అమ్మ పెట్టదు, అడుక్కోనివ్వదు ” అవుతుంది. ఉపాధ్యాయులు కూడా తమ వృత్తి ధర్మాన్ని నిర్వర్తించి విద్యార్థులను తరగతులలోనే తీర్చి దిద్దే ప్రయత్నం చేయాలి. ప్రభుత్వం కూడా తనవంతు పాత్రను నిర్వర్తించాలి. అది చేయకుండా ప్రభుత్వం చేసే నిర్ణయాలు ‘ గాలి ’ లో కలిసిపోతాయి. అసలు చర్య తీసుకొనే ముందు పూర్వాపరాలను చక్కగా నిశితంగా పరిశీలించాలి. లాభ నష్టాలను బేరీజు వేసుకోవాలి. అప్పుడు అది విజ్ఞత చర్య అనిపించుకుంటుంది. ప్రస్తుత ఈ చర్య కేవలం కక్ష సాధింపుతో తీసుకొనిన చర్యే అనడంలో ఏమాత్రం సందేహం లేదు. కనీసం వచ్చే విద్యా సంవత్సర ఆరంభంనుండే ప్రభుత్వం కట్టుదిట్టమైన, ఆచరణ యోగ్యమైన చర్యలను గైకొనాలి. అధ్యాపకులు తమ వృత్తి ధర్మాన్ని సరిగా నిర్వర్తించక పోయినా, ప్రభుత్వం అనాలోచిత, ఆచరణయోగ్యం కానటువంటి నిర్ణయాలను గైకొనినా చివరకు నష్టపోయేది విద్యార్థులే. ఇది గమనించాలి. ★

# అభిప్రాయవేదిక

"శ్రీవాణి" అందినది. ఆసాంతం పఠించితిని. ఆశ్రమ వాస పర్వము నన్నెంతయో అలరించినది. అతి త్వరలో జీవితచందా నానందముతో సమర్పించుకుంటాను.

– అబ్బరాజు శ్రీకృష్ణదేవుడు

శ్రీవాణి బాపుంటున్నది. సరస్వతి వాణిగా వికసిస్తున్నది. అమృత మధురమూ, పరిపూర్ణమూ అయిన భారతీయ సాంప్రదాయాన్ని నవీకరించి సముద్ధరించే కృషిని చక్కగా ప్రారంభించింది. క్రమ వికాసాన్ని అందుకొంటున్నది. సమగ్ర సంపూర్ణంగా ఫలించగలదనే నా విశ్వాసం. నా శుభాకాంక్షలు.

– పద్మశ్రీ డా॥ బోయి భీమన్న, Ex. MLC.

" నేడు అశ్వమేధయాగం చేయవచ్చునుగాని పత్రిక నడపడం చాలా కష్టం. మీ పత్రిక చదివి ఎంతో ఆనందించాను. సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక విద్యా పత్రిక శ్రీవాణి ఒక్కటే అనుటలో ఏ మాత్రం సందేహం లేదు. మీరు ధైర్యంతో పత్రిక నడుపుతున్నారంటే మీ ఆత్మబలం తప్ప మరేమికాదు. "

– భూపతిరాజు రాజగోపాలరాజు
ప్రధాన కార్యదర్శి, తెలుగు సాహితీ సమాఖ్య
తాడేపల్లిగూడెం

" రాశి పెరిగినా వాసి అంతగా పెరగని నేటి పత్రికల్లో శ్రీవాణి ఒక మెరుపురేఖ. కేవలం సాహితీ సాంస్కృతిక పిపాసులకే కాకుండా, ధార్మిక, నైతిక, సామాజిక, వైద్య సంబంధ అంశాలను ప్రచురిస్తూ సర్వజనామోదంగా చేస్తున్న మీ కృషి అభినందనీయం. "

– మడిపల్లి దక్షిణామూర్తి
కడం ప్రాజెక్టు

" శ్రీవాణి చాలా గొప్పగా ఉంది. నిజమైన సాహిత్య సేవ జరుపుతున్నది. నిజానికి మీ పత్రిక భావాలు లాంటి భావాలతో పత్రికను ముమ్ముందుకు తీసుకొనిపోవడం ఎంత కష్టమో అనుభవపూర్వకంగా నాకు తెలుసు. మీ ధైర్యమునకు, సాహసమునకు, పట్టుదలకు నా అభినందనలు. "

– కొల్లూరి సూర్యనారాయణమూర్తి
ఎడిటర్ 'X' రే

" జాతీయ నాయకుల జీవిత చరిత్రలు, అనేక విజ్ఞాన విశేషాలు, మీ పత్రికద్వారా తెలుసుకొనే అవకాశము లభించినందుకు అభినందిస్తున్నాను. "

– పి. రాజేంద్రప్రసాద్
డైరెక్టరు, ఆపో–

# స్వీకారం

" శ్రీ కృష్ణానందరవళి " వెల : అమూల్యము
రచయిత్రి : ఆలూరు రత్నమ్మ
ప్రతులకు : ఆలూరు శ్రీనివాసులు
2_268 కొండమిట్ట, శ్రీ కాళహస్తి, చిత్తూరు జిల్లా

" సూర్యద్విజం " కవితా సంకలనం వెల : 4/-
ప్రతులకు : సాహితీ మిత్రులు
25_364 బుట్టాయిపేట, మచిలీపట్నం

" పుష్పాంజలి " (కవితా సంకలనం)
ప్రచురణ : విజయ సాహితి, విజయపురి
హిల్ కాలనీ–508 202, నాగార్జునసాగర్

" మానవత్వం " (సాంఘిక నాటకము)
వెల : రు. 4
రచన : పి. నటరాజ్
ప్రచురణ : అరుణా పబ్లిషింగ్ హౌస
ఏలూరు రోడ్, విజయవాడ_2

# రంజనిమాల

సంకలనం

డా॥ వి. ఫణీంద్రుడు

ఈ క్రింది నవలల పేర్లతో రంజనిమాలను పూరించండి.



1) తార 2) సుధ 3) సంధ్య 4) ఆహుతి 5) జీవని 6) ప్రతిమ 7) భారతి 8) భావన 9) మాధవి 10) అగ్రహారం 11) అపరంజి 12) ఏది పాపం 13) ధర్మచక్రం 14) పూలవాన 15) మనస్విని 16) జీవనచక్రం 17) తల్లి మనస్సు 18) తొలి మలుపు 19) నయనతార 20) పేక మేడలు 21) అందని అదృష్టం 22) ఆశల దీపాలు 23) జీవిత చిత్రాలు 24) జీవన సర్వస్వం 25) జీవన సంగీతం 26) మగువ మనసు 27) మనసులు మారాయి 28) నాగావళి నవ్వింది 29) అతకని మనసులు 30) పారిపోయిన ఖైదీలు 31) కలల కడలిలో అలల జీవితం

## ఏప్రియల్ సంచిక సమాధానములు

### అడ్డము :

1. ఆనందారామం, 3. హజరా, 5. ఉషశ్రీ, 8. శ్రీధర, 9. అడవి బాపిరాజు, 10. విశ్వం, 12. విశ్వనాథ సత్యనారాయణ, 16. కవిత, 17. కృష్ణశాస్త్రి, 19. కోమలాదేవి, 21. లత, 24. కె. రామలక్ష్మి, 26. రాజేంద్ర, 27. కామేశ్వరరావు, 28. పండిత గోపదేవ్.

### నిలువు :

1. ఆలేటి నాగమణి, 2. రాచకొండ విశ్వనాథశాస్త్రి, 4. రామరాజు, 5. ఉన్నవ విజయలక్ష్మి, 6. శ్రీశ్రీ, 7. శరత్, 11. చక్కిలం విజయలక్ష్మి, 13. ధనికొండ హనుమంతరావు, 14. నాగశిరోమణి, 15. జి. కృష్ణ, 17. కృష్ణారావు, 18. శాయి, 20. దేవరాజు సీత, 22. వసుంధర, 23. ఆరుద్ర, 25. లక్ష్మి.

# “పదార్థ విజ్ఞానం కాదు-
# పరార్థ విజ్ఞానం కావాలి”

నేటి విద్యలు తెలివితేటలనే పెంచు
కొంచమైన గుణము పెంచబోవు
కోటి విద్యలుండి గుణము లేకున్నచో
వాటి విలువ ఏటి పాలు గాదె !
బహుల విద్యలయ్యె వాంఛలు మితిమీరె
పలుకులందు హీరో పనికి జీరో !
తెలివితేటల వలన కలుగు లాభంబేమి ?
కొంచెమైన ఆచరించరయ్య !

**శ్రీ సత్యసాయిబాబా**

సత్యం, దానం, తపస్సు, స్నేహం, శుభ్రత, ఋజు వర్తన, విద్య, క్రమశిక్షణ, గురుశుశ్రూష - ఈ తొమ్మిది విద్యారత్నాలు. విద్యార్థికివి శోభను కలిగిస్తాయి. సత్యం, జ్ఞానం అనంతం. సత్యశీలమైన స్థానంలో ధర్మం, ప్రేమ, శాంతి, అహింసలు అంతర్భాతములై వుంటాయి. “ఏకంసత్ - విప్రాః బహుధా వదంతి ” ఉన్నది సత్య మొక్కటే అయినప్పటికీ ఋషులు దీనిని అనేక నామ ములు పిలుస్తూ వచ్చారు. సత్యమును పట్టు వదలక, అతిక్రమించక జీవించేవాడే ఆదర్శమానవుడు. సత్యం ప్రాణ సమానం.

“ సత్యంబ్రూయాత్, ప్రియంబ్రూయత్ నబ్రూయాత్ సత్యమప్రియం ” - సత్యమునే పలుకవలెను. ప్రియము గదా యని అసత్యమును పలుకరాదు. సత్యమని కఠినంగా ఉండరాదు. ప్రీతి కదా అని అసత్యం చెప్పరాదు. ఇట్టి సత్యాన్ని భారతీయ ఋషులు ప్రచార ప్రబోధలు సలిపి సార్థకత నందుకున్నారు. హృదయ పరివర్తన నిమిత్త మేర్పడినదే విద్య. కాని ఈనాటి మానవుడు తన పరిశోధనల ద్వారా అందుకున్న అల్పజ్ఞానాన్ని విశ్వజ్ఞానంతో చేర్చి విఱ్ఱవీగుతున్నాడు. విజ్ఞానాన్ని, ఆధ్యాత్మిక, ధార్మిక విశ్వాసాన్ని సమన్వయం గావించి సమరసమును సాధించే విద్యనే సరియైన విద్య అంటారు.

మానవుడు విద్య విలువను మొట్టమొదట గుర్తిం చాలి. విద్య కేవలం ఉద్యోగ నిమిత్తమనే భావం పై దొలిగినప్పుడే మానవులు సుక్షేమాన్ని అందుకోగలరు. ఈ సత్యాన్ని గుర్తించినవాడే నిజమైన విద్యావంతుడు. ఈనాడు పదార్థ విజ్ఞానశాస్త్రం విరివిగా పెరిగిపోవడంచేత తన తత్వమేవో తాను గుర్తించుకొనకనే తాను విద్యా వంతుడైనట్లు భావిస్తున్నాడు. పదార్థ విజ్ఞాన శాస్త్రానికి అతీతమైన తత్వాన్ని గుర్తించినప్పుడు ఈ పదార్థ విజ్ఞానం కూడా సార్థకమవుతుంది. Physics కాదు Meta Physics, పదార్థ విజ్ఞానంకాదు, పరార్థవిజ్ఞానం. అనేకమంది దీనిని గుర్తించి ఇప్పుడిపుడే ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించడానికి ప్రయత్నిస్తున్నారు.

విజ్ఞానశాస్త్రం గొప్పది కాదని చెప్పకూడదు. విజ్ఞాన శాస్త్రం అత్యవసరమైనదే. విజ్ఞానాన్ని అభివృద్ధిపరుచు కోవడం ఎంత అవసరమో, అభివృద్ధి పరుచుకొన్న విజ్ఞా నాన్ని సద్వినియోగం చేసుకోవడం కూడా అంతే అవ సరం. విజ్ఞానం ఉండి వివేకం లోపించడం వలన అనేక అరిష్టాలు కలుగుతున్నాయి. ‘ న్యూటన్ ’ భూమికి ఆకర్షణశక్తి కలదని గుర్తించాడు. అయితే తాను గుర్తించడానికి ముందే భూమికి ఈ శక్తి ఉన్నదని గ్రహించాడు. తాను భూమ్యాకర్షణ శక్తిని గుర్తించానే

తప్ప, సృష్టించలేదని స్పష్టం చేశాడు. సృష్టికి ఒక సృష్టికర్త ఉన్నాడని అతను విశ్వసించాడు. ఐన్‌స్టీన్ కూడా ప్రకృతి శక్తి సామర్ధ్యాలను తన పరిశోధన ద్వారా గుర్తించి, ఆ తర్వాత ఆధ్యాత్మిక మార్గంలో ప్రవేశించాడు. "హైజన్ బర్గ్" విజ్ఞాన శాస్త్రాన్ని పరిశోధించి ఆధ్యాత్మికత, విజ్ఞాన శాస్త్రాలకున్న సంబంధాన్ని గురించి విచారించడానికి ప్రయత్నించాడు. యోగ శాస్త్ర రహస్యాన్ని గుర్తించి, మనస్సును స్వాధీన పరచుకొని మహామనిషివి కమ్మన్నాడు. "ష్రోడింగర్" అనే విజ్ఞానవేత్త ఆధ్యాత్మికానికి, విజ్ఞానానికి అంతస్సంబంధమున్నదని, విజ్ఞానానికి ఆధ్యాత్మికమే ఆధారమని నిరూపించాడు. కోరికలు అధికంగా పెంచుకోవడం చేత మానవుని తెలివితేటలు క్రమేణా సన్నబడుతున్నాయని, అధిక వాంఛల వలన అధిక నిరాశ కలుగుతుందని చెప్పాడు. "డెరాక్" అనే తత్త్వవేత్త ఆధ్యాత్మిక తత్వాన్ని అభివృద్ధి గావించుకొని ఆధ్యాత్మికం, విజ్ఞానానికి గల సంబంధాన్ని కనుగొనడానికి కృషి చేశాడు. "అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయం, పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనం" - అనే వ్యాసుని 18 రచనలలోని సారాంశాన్ని డెరాక్ Love ever, hurt never (ఎల్లప్పుడూ ప్రేమించండి, ఎప్పుడూ ద్వేషించకండి) అని రెండు మాటలలో చెప్పాడు. "డీబ్రోగ్లీ" అనే మహాతత్త్వవేత్త ఆధ్యాత్మిక తత్వాన్ని తీవ్రంగా విమర్శించి, తరువాత తన విమర్శ ఉత్త తెలివి తక్కువ విమర్శ అని బాహాటంగా ప్రకటించాడు. కనుక విజ్ఞాన శాస్త్ర రంగంలో కూడా ఇలాంటి మహర్షులు ఎందరో ఉన్నారు.

మహాభారతంలో వ్యాసుడు వివరించిన తత్వాన్ని గుర్తించి "సితా" అనే తంత్రుల ద్వారానే భువనములు, భూతములు కలుగుతున్నాయన్న సత్యాన్ని నిరూపించడంలో అణుశక్తి తత్వాన్ని తరంగాలతో పోల్చి చూపిన విజ్ఞానవేత్త "ఫిష్‌జాబ్ కాప్రా". ఇతను అణువుకు తరంగాలతో ఉన్న సన్నిహిత బాంధవ్యాన్ని గురించి పరిశోధించాడు. అర్జునుడు సుభద్రకు పద్మవ్యూహాన్ని గురించి చెప్పుతున్న సమయంలో కృష్ణుడు వచ్చి "బావా! వింటున్నది సుభద్ర అనుకుంటున్నావా? ఆమె ఎప్పుడో నిద్రపోయింది. వింటున్నది ఆమె గర్భస్థ శిశువు (అభిమన్యుడు) మాత్రమే" అని అంటాడు. కృష్ణుడు చెప్పినట్లుగ గర్భస్థ శిశువుపై పరిసరాల ప్రభావాలు ఉంటాయా లేదా అని పరిశోధనలు సలిపి కృష్ణుడు చెప్పింది అక్షరాలా నిజమని నిరూపించాడు అమెరికాలోని కెరొలీనా యూనివర్శిటీ ప్రొఫెసర్ "ఆంథోనీ కాస్పా". తల్లి గర్భంలో ఉన్నప్పుడు బిడ్డ ఏఏ శబ్దాలని వింటుందో పుట్టిన తర్వాత బిడ్డ నోటినుండి అవే శబ్దాలు వచ్చినట్లు ఆయన కనుగొన్నాడు. తల్లి కంఠధ్వనిని ఆలకించే దివ్య శక్తి గర్భస్థ శిశువుకున్నట్లు కూడా ఆయన కనుగొన్నాడు. 1984 జనవరి 3 న, ఆయన తన పరిశోధనల ఫలితాలను ప్రకటిస్తూ భారతంలో గర్భస్థ శిశువు పరిస్థితి గురించిన వివరణ అభూతకల్పన కాదని, అది సత్యమని పేర్కొన్నాడు.

విజ్ఞాన తత్వవేత్తలు అల్పబుద్ధి కలవారు కారు. సత్యాలను నిరూపించడానికి తమ జీవితాలను సైతం ధారపోసిన వారు ఎందరో వున్నారు.

## సంస్కృతం

"సంస్కృతం, ప్రారంభంలో కనిపించినట్లుగా నేర్చుకొనుటకు కఠినమైన భాష కాదు. అది కొబ్బరికాయ వంటిది. దాని ఉపరితల భాగము గట్టిగా కన్పించినప్పటికీ, దాని లోపల మధురమైన జలము, కొబ్బరి ఉంటుంది. అదే విధముగా సంస్కృతం అభ్యసించడం మొదలుపెడితే అతి తేలికగా వస్తుంది".

— డా॥ సరోజినీ మహిషి

ఎన్ని చదువులు చదివియు ఏమి ఫలము ?
తన నొసట వ్రాత తప్పించ నెవరి తరము ?
పెద్ద బుద్ధులు తమ తల చేరెనేని
ఎండ బారును బుద్ధులు బెండుబారు.

చదువుతోపాటు సంస్కారాన్ని అభివృద్ధి పరచుకోవాలి. విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. కాని ఈ నాటి చదువు లెలాంటివి ? నీటి బుడగల వంటివి. పరీక్షహాలుకు వెళ్ళి తలలో నింపుకున్నదంతా కాగితాలమీద కుమ్మరించి ఖాళీ బుర్రలతో తిరిగి వస్తారు. పుస్తకం నుండి మస్తకానికి - వన్‌వే ట్రాఫిక్‌గా తయారైనది నేటి విద్య. నిజమైన విద్యాభ్యాసం హృదయంలో చేయాలి. విద్య రక్తంలో ఇమిడిపోవాలి. ప్రవర్తనలో చేరిపోవాలి. అతనే నిజమైన విద్వాంసుడు. అట్టి వ్యక్తులే దేశానికి ఈనాడు అత్యవసరం.

అన్ని చదువులకంటే ప్రేమ చదువు చాలా ఉత్తమమైన చదువు. ప్రేమే జగత్తును రక్షించేది. దేశాభివృద్ధి కేవలం పరిశ్రమలవల్ల మాత్రమే జరిగేది కాదు. మేధ మిద్దెలతో మాత్రమే అభివృద్ధి గాంచదు. ప్రేమతత్త్వాన్ని పెంచుకోవాలి. నీతి నిజాయితీలను అలవరచుకోవాలి. ఈ నీతి నిజాయితీలే ప్రాచీనకాలంనుండి మన దేశాన్ని రక్షిస్తున్నాయి.

> ఆధునిక విద్య పెరిగెను అంతులేక
> ఆత్మ విద్యయు క్షీణించె అవధిలేక
> సత్యధర్మంబులన్నియు సమసిపోయె
> ప్రేమ శాంతి అహింసలు పేదవడియె
>
> సత్య ధర్మ అహింసలు శాంతి ప్రేమ
> మానవుని పంచ ప్రాణాలు మహిని ఇవియు
> పంచ ప్రాణాలలో ప్రేమ ఎంతో హెచ్చు
> కాన హృదయాన ప్రేమను గట్టిపరచు !
>
> — శ్రీ సత్యసాయిబాబా

విద్యార్థులారా! విద్యాబోధకులారా! విద్యాభిమానులారా! విద్యాధికులారా! ప్రేమతత్వం, ఆధ్యాత్మిక తత్వం, ధార్మిక భావనలు ఉండే విద్యను అభ్యసింప జేయండి. భారతదేశాన్ని తీర్చిదిద్దడానికి కంకణబద్ధులవ్వండి.

(శ్రీ సత్యసాయి విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో (22-11-85) ఛాన్సలర్ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారి దివ్యోపన్యాసము నుండి) ★

## సంతాపం

కృష్ణాజిల్లా సత్యసాయి సేవా సంస్థల అధ్యక్షులు శ్రీ గాదె అచ్చిరాజు గారు ది. 28-4-1986 వ విజయవాడలో వారి స్వగృహంలో గుండెపోటు వచ్చి భగవాన్ శ్రీ సత్యసాయిలో లీనమైనారు. వీరికి భార్య ముగ్గురు కుమార్తెలు, ఒక కుమారుడు కలరు. నిరంతరం సాయి సేవకు అంకితమైన కుటుంబం వీరిది. రాజుగారి కుటుంబ సభ్యులకు మా ప్రగాఢ సంతాపం తెలియజేయు చున్నాము. — సం.

## సవరణ

ఏప్రిల్ సంచిక 15వ పేజీలో శ్రీవాణి జీవిత సభ్యులు ఫొటో క్రింద పేరు ఈ క్రిందివిధంగా సవరించి చదువుకొన మనవి.

శ్రీ చిరుమామిళ్ళ నారాయణరావు
ప్రసన్న ఆంజనేయస్వామి దేవాలయ నిర్వాహకులు
చందాపురం — సం.

## పరమహంస పరివ్రాజకాచార్య

# శ్రీ పూర్ణానంద భారతీస్వామి

వె. లోకనాథశ

నమో బ్రహ్మాదిభ్యో, బ్రహ్మ విద్యా సంప్రదాయ కర్తృభ్యో, వంశ ఋషిభ్యో, నమో గురుభ్యః —

నారాయణ సమారంభాం, శంకరాచార్య మధ్యమామ్ శ్రీ పూర్ణానంద భారతీ పర్యంతాం, వందే గురు పరంపరామ్.

వైశాఖశుద్ధ పంచమినాడు జగద్గురువైన శ్రీ శంకర భగవత్పాదుల జయంతి. అందువలన భారతదేశ చరిత్ర లోనే కాదు ప్రపంచ చరిత్రలోని ఈ దినం అత్యంత విశిష్టత నాపాదించుకున్నది. కేరళలోనే కాలడిలో జన్మించి భారతదేశం కన్యాకుమారి మొదలు కేదారం వరకు ప్రయాణించి ఆనాడు బహుళ ప్రచారంలో వున్న బౌద్ధ, చార్వాకాది నాస్తిక మతములను ఖండించి అద్వైత మత ప్రతిష్ఠాపనగావించి భారతదేశంలో దక్షిణాన శృంగేరీ లోను, ఉత్తరాన బదరీలోను, తూర్పున పూరీలోను, పశ్చిమాన ద్వారకలో చాతురామ్నాయ పీఠములను స్థాపించి సనాతన హిందూ ధర్మమును కాపాడిన అపర శంకరుడు శ్రీ జగద్గురు శంకరాచార్య భారతి. ప్రస్థానత్రయమునకు అనగా ఉపనిషత్తులకు, బ్రహ్మసూత్రములకు, భగవద్గీతకు అమూల్యమైన అనితరసాధ్యమైన వ్యాఖ్యానమును అనేక ఇతర గ్రంథములను రచియించిన పుంభావ భారతీ స్వరూపుడు శ్రీ జగద్గురు శంకరాచార్యులవారు.

అట్టి శ్రీ జగద్గురు శంకరాచార్యులవారి సాంప్రదాయమైన భారతీ సాంప్రదాయములో ఒకానొక వైశాఖ శుద్ధ పంచమినాడు గృహస్థాశ్రమమును సర్వ సంపదలను తృణప్రాయముగా త్యజించి తురీయాశ్రమమైన సన్యాసాశ్రమమును స్వీకరించిన మహనీయుడు శ్రీశ్రీ పూర్ణానంద భారతీ స్వాములవారు.

వీరు పూర్వాశ్రమంలో గుంటూరుజిల్లా తెనాలి తాలూకా అనంతవరం గ్రామ నివాసి. వీరి పూర్వాశ్రమ నామము బ్రహ్మశ్రీ యాబలూరు ఆదినారాయణశర్మగారు, గౌతమస గోత్రీకుడు. వీరి తండ్రి నారాయణమూర్తి. తల్లి కృష్ణవేణమ్మ. వారి సంతానములో ద్వితీయుడైన ఆదినారాయణశర్మగారు అద్వితీయ ప్రతిభాశాలి. ఉభయశ్రీ సమన్వితుడు, జ్ఞానసంపన్నుడు. వీరు స్వార్జితముగ అనేక లక్షలు సముపార్జించి అనేక ధర్మకార్యములను చేసి తమ కీర్తి ఆచంద్ర తారార్కము చిరస్థాయిగా నుండునట్లుగా తెనాలి రామలింగేశ్వర పేటలో శ్రీ పరమహంసాశ్రమము అను ఆశ్రమమును, శ్రీ రాజరాజేశ్వరీ అపర కర్మల ధర్మసత్రమును స్థాపించినారు. తెనాలి రామలింగేశ్వర పేటలోని బోసురోడ్డులో కల్యాణాది శుభకార్యములు జరుపుకొనుటకు వీలుగా వారి ఆత్మీయుడైన బ్రహ్మశ్రీ మూల్పూరు సుబ్రహ్మణ్యశాస్త్రిగారి పేర వారి నిర్వ్యాజ ప్రేమకు, మైత్రికి ప్రతీకగా వారి స్మారక చిహ్నముగా "శ్రీ సుబ్రహ్మణ్య కల్యాణ మండపము" నకు స్థల మొసగిన దాతలు శ్రీ ఆదినారాయణశర్మగారు. వీరు వైశ్వదేవాది పాకయజ్ఞములు చేసిన పాకయాజి. వీరు శ్రీ శృంగేరీ శ్రీ విరూపాక్ష పీఠాధీశ్వరులైన జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీస్వామివారి వద్ద శ్రీ విద్యనుపాసించి పాదుకాంత దీక్ష తీసికొనిన పూర్ణానందనాథ దీక్షా

## తెలుగు తల్లి

ఇంటిముందు తెలుగుతల్లి రాతి బొమ్మ
ఇంటిలోని ఇల్లాలొక కీలుబొమ్మ
వీధిలోన ఆడపిల్ల ఆటబొమ్మ.

నది ఒడ్డున కృష్ణవేణి
పూజలందుకొంటుంది
నలుగురిలో ఆడతనం
నలిగి నిష్క్రమిస్తోంది.

ఆంధ్రమాత భరతమాత
భావించేది సిరిదేవి
నేలతల్లి నీరుతల్లి
ధనం తల్లి పంట తల్లి.

గోటి వెక్కిరితలా ఇవి
నొసటిమీది రాతలా ఇవి
ఏది ప్రశ్న ఏది జవాబు
ఆడతనం మీద రుబాబు.

చట్టంలో సమానత
న్యాయంగా నున్నా
నీటిమీద రాతల్లా
ధర్మాలు దేనికేమన్నా.

— టి. వాణీ రంగారావు

నామధేయులు. వీరు అఖిల శాస్త్ర పురాణతత్వాబ్ధులాపోసన పట్టిన పండితుడు. గురువుల వద్ద ప్రస్థానత్రయ శ్రవణము చేసి వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థ రహస్యములను కరతలామలకము చేసికొన్న మహనీయుడు. 45 సంవత్సరములు పైగా అవిఛ్ఛిన్నముగా శ్రీ దేవీ శరన్నవరాత్రోత్సవములు, శ్రీ చక్ర నవావరణార్చనలు, లక్ష కుంకుమార్చనలు, సువాసినీ బాల పూజలు, మహారుద్రాభిషేకములు, లక్ష దీపారాధనలు, సమారాధనలు స్వంత ద్రవ్యముతో జరిపిన గొప్ప శ్రీ విద్యోపాసకుడు. పూర్వాశ్రమంలో వీరి భార్య వజ్రమాంబగారు. వీరలకు 1. కల్యాణ శంకరశర్మ. 2. లోకనాధశర్మ అను ఇరువురు కుమారులు 3. శారద 4. పరమేశ్వరి అను ఇరువురు కుమార్తెలు కలరు. పెద్ద కుమారుడు కల్యాణ శంకరశర్మ తెనాలిలో న్యాయవాది. రెండవ కుమారుడు లోకనాధశర్మ విజయవాడలో న్యాయవాదిగా ప్రాక్టీసు చేయుచున్నారు. తండ్రి వద్దనే పూర్ణదీక్ష పొందిన అదృష్టవంతులు. వీరి పెద్ద అల్లుడు తెనాలి వాస్తవ్యులు శ్రీ మున్నంగి వెంకటేశ్వర రావుగారు — మహా నైష్ఠికుడు. నిత్య శివపూజా దురంధరుడు. రెండవవారు గుంటూరు నివాసి శ్రీ కాట్రపాటి లక్ష్మీకాంతరావుగారు. అడ్వకేటు. వీరు కూడ శ్రీస్వామివారి వద్దనే శ్రీ విద్యను స్వీకరించినారు శ్రీ ఆది నారాయణశర్మగారి కుమారులు, కూతుళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనుమరాండ్రు అబాలగోపాలము అందరూ శ్రీ విద్యోపాసకులే.

శ్రీ పూర్ణానంద భారతీ స్వామివారు శ్రీ భువనేశ్వరీ పీఠాధీశ్వరులు (గన్నవరం) శ్రీ సత్యానంద భారతీస్వామి వారి వద్ద ప్రణవోపదేశమును, పొంది యథావిధిగా వైశాఖ శుద్ధ పంచమినాడు సన్యాసాశ్రమమును స్వీకరించినారు. శ్రీ పూర్ణానంద భారతీ స్వామివారి పరమేష్ఠి గురువు, జగద్గురు శ్రీ కుర్తాళ పీఠాధీశ్వరులు శ్రీ శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వాములవారు. పరమ గురువు బ్రహ్మీభూత జగద్గురు శ్రీ కుర్తాళ ఉపపీఠాధిపతులు అయిన శ్రీ శ్రీ విమలానంద భారతీ స్వామివారు, పరంపరా గురువు శృంగేరీ శ్రీ విరూపాక్ష పీఠాధీశ్వరులు శ్రీ కల్యాణానంద భారతీస్వామివారు.

శ్రీ పూర్ణానంద భారతీ స్వామివారు ప్రస్తుతము విజయవాడ గవర్నరుపేట, రాజగోపాలాచారి వీధిలోని శ్రీ త్రివిక్రమ రామానంద భారతీ స్వామివారి యాజమాన్యములోని శ్రీ దత్తాత్రేయాశ్రమము, లలితా త్రిపుర సుందరీ పీఠములో తపోనిష్ఠులై నిరంతర ప్రణవోపాసన తత్పరులైయున్న పరమహంస. వీరు అనేక వందల మందికి శ్రీ విద్యోపదేశములు చేసి శ్రీ విద్యావ్యాప్తి గావించిన మహనీయుడు. వీరు మంచి వక్త. శంకరాచార్య ప్రతిపాదితమైన అద్వైత సిద్ధాంతాన్ని అరటిపండు వలిచిపెట్టిన రీతిలో చెప్పి ఆబాల గోపాలమును అద్వైతాను రక్తులను గావించుచున్న అవిరళ తపోనిష్ఠాగరిష్ఠులు. ★

కంచి కామకోటి పీఠాధిపతులు

# శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామి

కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారు. వీరి వేదశాస్త్ర శ్రౌతములేగాక పెక్కు భాషలలో పాండిత్యము కలదు. భూత భవిష్యద్వర్తమానజ్ఞులు, విజ్ఞులు. వీరి చర్యలంబట్టి వీరపర శంకర స్వాములని చెప్పవచ్చును. ఒకానొక కాలమందు నాయ కాల మృత్యువును బోగొట్టిన వారని మనవి చేయు చున్నాను. శ్రీవారి మహిమాతిశయాన్ని విని విదేశీయులనేకమంది నేటివరకు అపుడపుడు వచ్చి దర్శించి వెళ్ళుతుంటారు. 60 ఏండ్లకు పూర్వం "పాల్‌బ్రంటన్" అనే విదేశీ ప్రముఖుడు చెంగల్పట్టులో శ్రీవారిని దర్శించి తన అనుభవాలను "ఏ సర్చ్ ఇన్ సీక్రెట్ ఇండియా" అనే గ్రంథంలో వ్రాసాడు. విదేశీ భక్తులతో శ్రీవారి సంభాషణలను కొన్నింటిని మద్రాసు విశ్వవిద్యాలయ సంస్కృతం ప్రొఫెసర్ డా. వి. రాఘవన్ "ది జగద్గురు" అనే ఆంగ్ల గ్రంథంలో ప్రచురించారు.

## సంపూర్ణయాత్ర

శ్రీవారు 1919లో సంపూర్ణయాత్రను సంకల్పించి కాలి నడకన 21 సం. లలో పూర్తి చేశారు. మొదట రామేశ్వరం వెళ్ళి అచట ఇసుక తీసుకుని ప్రయాగ వెళ్ళి త్రివేణి సంగమంలో కలిపి, ఆ ఉదకం తెచ్చి మరల రామేశ్వరంలో అభిషేకం చేసారు. శ్రీవారు రామేశ్వరం వెళ్ళినప్పుడు పాంబన్ జలసంధి దాటవలసి వచ్చింది. రైలుపట్టాలపై నడచి వెళ్ళారు. కాశీ వెళ్ళినప్పుడు కాశీ మహరాజా, పండిత మదనమోహన మాలవ్యా మున్నగు ప్రముఖులు స్వాగత సత్కారాలతో శ్రీవారిని సత్కరించారు. సంపూర్ణ భారతదేశయాత్ర దిగ్విజయంగా చేసిన జగద్గురువులు శ్రీవారు. వీరి ఈ యాత్ర సనాతన ధర్మస్థాపనకు సోపానమైంది. వైదికధర్మ ఆచరణకు, వేదాంతశాస్త్ర అధ్యయనమునకు, లోకకళ్యాణమునకు బాటలు వేసింది వీరి భారతయాత్ర. వీరు కంచి పెద్దస్వామిగా జనబాహుళ్యంలో పేరుగాంచిన శ్రీ చంద్రశేఖర సరస్వతీ స్వామివారు 68వ పీఠాధిపతి.

డా॥ పి. జి. కృష్ణమూర్తి

## జననం

పూర్వాశ్రమ నామం స్వామినాధన్. తల్లిదండ్రులు శ్రీమతి మహాలక్ష్మి, శ్రీ సుబ్రమణ్యశాస్త్రిగారలు. వీరు దక్షిణ ఆర్కాట్ జిల్లాలోని విల్లుపురంలో 20-5-1894న జన్మించారు. తెలుగు లెక్కల ప్రకారము జయ వత్సర వైశాఖ బహుళ పాడ్యమి ఆదివారం. వీరి పితామహులు శ్రీ గణపతి శాస్త్రిగారు సాంగోపాంగంగా ఋగ్వేదాధ్యయనం చేసి షడ్దర్శన పారంగతులై 1840 లో కంచి కామాక్షీదేవి ఆలయ కుంభాభిషేకంలోనూ, 1846 లో జంబుకేశ్వరంలో జరిగిన అఖిలాండేశ్వరి తాటంక ప్రతిష్ఠలోను ప్రధాన పాత్ర వహించారు. మాతృ వంశంలో సుప్రసిద్ధులు గోవింద దీక్షితులు, పండితులు యజ్ఞ దీక్షితులు రాజకార్య దురంధరులుగా కూడా ప్రసిద్ధినొందారు. మాతామహులు శ్రీ నాగేశ్వర శాస్త్రిగారు సలక్షణ ఋగ్వేదాధ్యేత. శ్రీవారి పూర్వాశ్రమ కుటుంబం మైసూరు మండలంలో కన్నడం మాతృభాషగాకల్గి ఋగ్వేద శాఖకు చెందిన హొసైలే కర్నాటక స్మార్త, బ్రాహ్మణ శాఖకు చెందినది.

> కంచి కామకోటి పీఠాధిపతులు
> శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారి 92వ జన్మదినోత్సవ సందర్భమున 'శ్రీవాణి' ప్రత్యేక సంచికకు శ్రీ పురాణం వెంకట రామకృష్ణశాస్త్రిగారు (బందరు). "శ్రీవాణి" కి జీవితసభ్యులుగా చేరినారు. వారికి మా కృతజ్ఞతలు.
>
> — సం.

## పీఠాధిపత్యం

1907 ఫిబ్రవరి 13 వ తేదీన శ్రీవారు తమ పూర్వజులైన మహాదేవ VIII స్వామివారి వద్దనుండి ఉత్తర ఆర్కాట్ జిల్లాలోని కలవాయి గ్రామంలో పీఠాధిపత్యం గైకొన్నారు. మఠం ప్రధానకార్య స్థానమైన కుంభకోణానికి తరలి వెళ్లారు. కుంభకోణంలో 9-5-1907న జగద్గురు పీఠాన్ని అలంకరించారు. శ్రీవారి పట్టాభిషేక ఉత్సవం కన్నుల పండువుగా నిర్వహింపబడ్డది.

## కుంభాభిషేకం

జంబుకేశ్వరంలోని అఖిలాండేశ్వరీదేవికి 1908 ఫిబ్రవరి మాసంలో కుంభాభిషేకం శ్రీవారు నిర్వహించిన రీతి గాంచిన వారికి ఆదిశంకరులు పూర్వం ఈ కార్యక్రమం నిర్వహించిన చందంగా కన్పట్టినది. వీరు 1909 లో పుష్కరకాలంలో ఒకసారి జరిగే మహామఖ ఉత్సవానికి విచ్చేసిన భక్తకోటికి దర్శన భాగ్యం కలుగజేశారు. 1911 లో కావేరీ నదికి ఉత్తర తీరాన తిరుచినాపల్లి జిల్లాలోని మహేంద్ర మంగళంలో స్వామి ఏకాంతవాసం చేస్తూ, విశేష తపస్సు ఆచరించి, శైవ, వైష్ణవ భక్తి వాఙ్మయం, జ్యోతిషం, ఖగోళశాస్త్రం, గణితం చతుష్షష్టి కళలలోని విశేషాలు, సంగీతం తదితర శాస్త్రాల అధ్యయనం చేశారు. ఇచట ఆదిశంకర విగ్రహ ప్రతిష్ఠ చేసి అనేక శాసన విశేషాలను పరిశీలించారు.

## కామకోటిపీఠం

కామకోటిపీఠం అంటే కోరిన వారికి కోర్కెలు తీర్చే కల్పతరువు వంటిది. తదనుగుణంగా కామాక్షీదేవి కరుణా కటాక్షం సర్వవాంఛా సిద్ధికి ఆలంబన ఔతుంది. కామకోటి పీఠం ఆదిశంకరులు అధిష్ఠించిన సర్వజ్ఞ పీఠంగా గణుతికెక్కింది. శ్రీ మహా సన్నిధానం వారు సాక్షాత్తు సర్వజ్ఞ మూర్తులుగా ఆధ్యాత్మిక ఉన్నతికి ధర్మానుష్ఠానానికి అంకితమై 62 సంవత్సరములు జగద్గురు పీఠాధిరోహితులై ధర్మపాలన చేశారు.

## శునకం వదంతం

1967 నుండి స్వామివారికి విశ్వాసపాత్రమై భక్తి ప్రపత్తులతో మెలుగుతూ వచ్చిన ఒక శునకం వదంతం ఇచట పేర్కొనదగినది. మఠంనుండి లభించిన ఆహారాన్ని మాత్రమే తీసుకుంటూ పరిశుభ్ర వాతావరణంలో పెరుగుతూ ఉన్న ఈ శునకం స్వామివారినీ, వారి పరివారాన్ని అనుసరిస్తూ వచ్చింది. ఒకరోజున ఒక గ్రామంలోని బాలుడు రాయితో దాన్ని కొట్టగా అది ప్రతీకారం తీర్చుకుంటుందేమోనని మఠంలోని వారు దాని కళ్ళకు గంతలు కట్టి 25 మైళ్ళ దూరం తీసుకువెళ్ళి విడిచివచ్చారు. కాని వారు తిరిగి మఠం చేరకమునుపే ఆ శునకం మఠాధిపతి చెంతకు చేరింది. తదాది ఆచార్యుల వారి దర్శనం కాకుండా అది ఒకరోజు కూడా ఆహారం తీసుకోలేదు. శ్రీవారు కూడా దానియందు ప్రేమ కలిగి దాని బాగోగులను గూర్చి తెలుసుకొనేవారు.

## మహనీయుల కలయిక

ఆచార్యుల వారిని కలుసుకొన్న మహనీయులలో పేర్కొనదగినవారు మహాత్మాగాంధీ, సి రాజగోపాలాచారి, సత్యమూర్తి, సి. ఆర్. దాస్, సర్ తేజ్ బహద్దూర్ సప్రూ, పండిట్ మదన్‌మోహన్ మాలవ్యా మొదలైన భారతీయులు ఉన్నారు. విదేశీయులలో ముందుగా ఉదాహరించ వలసినవారు పాల్‌బ్రంటన్ అనే బ్రిటీష్ రచయిత,

ఆధ్యాత్మిక జిజ్ఞాసి. 1931 లో బ్రంటన్ మహోదయుడు ఆచార్యుల వారితో ఇంటర్వ్యూ జరిపి తన గ్రంథమైన " A Search in Secret India "లో అనేక విషయాలను పొందుపరిచారు. అటు మహాత్మాగాంధీకి వీరితో సంభాషణ నిత్య భోజనానికన్నా మిన్నకాగా వీరు మహమ్మదీయ భక్తులకు అల్లాగాను, క్రైస్తవ భక్తులకు క్రీస్తుగాను కన్పడటం ఒక విశేషం.

24 గంటలలో 2-3 గంటలు మాత్రమే నిద్రిస్తూ, అతి సాత్వికమైన పిడికిలి ప్రమాణంగల ఆహారాన్ని భుజిస్తూ, అనేక వారాలు, పక్షాలు ఉపవాస దీక్షలో గడుపుతూ, శ్రీ మహా సన్నిధానంవారు దైనందిన కార్యక్రమాలను ఏ మాత్రం అలసట ఎరుగక నిర్వర్తించటం ఒక అద్భుతం స్థితప్రజ్ఞ అనేదానికి స్వామివారు పూర్ణ నిదర్శనం. వీరు దీర్ఘకాలం మౌనవ్రతం బూనడం జీవన విధానంలో ఒక భాగం.

## సంఘసేవ

"అనాథప్రేత సంస్కారాత్ అశ్వమేథ ఫలం లభేత్" అనే శాస్త్ర వాక్యాని కనుగుణంగా శ్రీవారు హిందూమత జీవాత్మ కైంకర్య సంఘం స్థాపించి అనాథలు, నిరుపేదలు ఐనవారు చనిపోయినపుడు ప్రేతసంస్కారాలను ఆచరించ వలసిందిగా హిందువులందరికీ విజ్ఞప్తి చేశారు. ఒకసారి తంజావూర్ జిల్లాలో పర్యటిస్తూ 200 మంది హరిజనులను కలసి వారి స్థితిగతులను తెలుసుకొని నూతన వస్త్రాలిచ్చి ఆశీర్వదించారు. కాంగ్రెస్‌పక్షాన మహాత్మాగాంధీ మొదలగు నాయకులు చేపట్టిన స్వాతంత్ర్యోద్యమాన్ని ఆశీర్వదిస్తూ భారతదేశం ఆధ్యాత్మికత అలవరుచుకొని ఐక్యతతో ఉద్యమిస్తే ధ్యేయాన్ని సాధించగలదని సూచించారు.

1944 లో వేద ధర్మపరిపాలన సభ ఆధ్వర్యంలో వేద పండితుల సభ జరిపి వేదాధ్యయనం కాలక్రమేణా పాశ్చాత్య నాగరికతా ప్రభావంవల్ల సన్నగిల్లుతుందని ఈ అధ్యయన పునరుద్ధరణకు అందరూ దీక్ష పూనాలని ఉద్బోధించారు. వైష్ణవ-శైవ మతాల మధ్య వైషమ్యం అనవసరమని, భగవంతుడొక్కడేనని, నిజమైన భగవత్తత్వం తెలిసికొనటం అవసరమని అనేక సభల్లో చెప్పారు. ధర్మపీఠాల అధిపతులనందరినీ దక్షిణదేశంలో ఒక వేదికమీద కలిపి ఆధ్యాత్మిక ఐక్యతకు మార్గాన్ని సుగమం చేశారు మతం హిందూ సంస్కృతికి మూల స్తంభం వంటిదని ఆధ్యాత్మికత ఆ సంస్కృతికి వెన్నుపూస వంటిదని విదితం చేశారు. భారతదేశంలో శిల్పం, నృత్యం మొదలగు విద్యలు ఇతర దేశాలలోవలే లౌకిక విద్యలు కావని వాటి పరమార్థం కూడా విద్యయొక్క పరమార్థం వంటిదేనని చెప్పారు. జగద్గురువు అనగానే వారి బోధలు ఎవరిని ఉద్దేశించిన దైనప్పటికి యావత్ మానవజాతికి చెందుతాయని చెప్పారు. ప్రతి ఒక్కరూ అందరి శ్రేయస్సుకూ ఎంతోకొంత శ్రమిస్తూ భగవంతుని అనుదినం కొలుస్తూ జీవిత పరమార్థాన్ని సాఫల్యం చేసుకోవాలనే సందేశం ఇచ్చారు. యోగమార్గంలోనే ధ్యానం అద్వైతసిద్ధికి సరియైన మార్గమని ప్రబోధించారు.

ఇప్పటికి 80 చాతుర్మాస్యలు ఆచరించి లక్షలాదిమంది భారతీయులకు భారతీయ సనాతన ధర్మ, ఆస్తిక, ఆధ్యాత్మిక క్రియాశీలకత్వాన్ని ప్రత్యక్షంగా చాటారు.

## శ్రీ జయేంద్ర సరస్వతీస్వామి

తంజావూరు జిల్లా, మన్నారుగుడి తాలూకా, ఇరూళ్ళిణీకి గ్రామంలో 1935 వ సంవత్సరంలో శ్రీ మహాదేవ అయ్యర్‌గారి పుత్రులు సుబ్రహ్మణ్య నామధేయులు నేటి 69 వ కంచి పీఠాధిపతి. వీరు బాల్యం నుండే పీఠంలో సంస్కృతం, వేదం అధ్యయనం చేశారు. తమ 19 వ ఏట 1954 లో సన్యాస ఆశ్రమ స్వీకారం చేశారు. వీరి యోగ పట్టం మహావాక్య ఉపదేశానంతరం శ్రీ జయేంద్ర సరస్వతి అను పేర ప్రాచుర్యంలోకి వచ్చింది. 1969 నుండి పీఠాధిపత్యం విజయవంతంగా నిర్వహిస్తూ వచ్చిన శ్రీ జయేంద్ర సరస్వతీస్వామివారు 51 సంవత్సరాలు నిండి పండిన ధర్మపాలనా దక్షత గల్గిన జగద్గురువులు.

## శ్రీ శంకరానందేంద్ర సరస్వతీస్వామి

వీరు 1969 లో పొన్నేరి గ్రామం వద్ద తందాళం అనే అగ్రహారంలో పూర్వాశ్రమ నామం శంకరన్‌గా వ్యవహరింప బడినవారు. మన కంచి పీఠానికి 70 వ పీఠాధిపతి. వీరు 1933 వ సంవత్సరంలో పీఠాధిపత్యం స్వీకరించారు. అపర ఆదిశంకరులా అన్నట్లు రూపురేఖా విలాసములతో ప్రకాశించే శ్రీ శంకరానందేంద్ర సరస్వతీస్వామి 7 సంవత్సరాల వేదవిద్యను 3 సంవత్సరాలలోనే అధ్యయనం చేసి, అనేక వేదవిద్వత్ సభలలో దిగ్విజయ భేరి మ్రోగించి అఖండ మేధా సంపత్తిని ప్రదర్శించిన బాల యోగి, జ్ఞాని, ఆచార్య పీఠానికి అరుదైన సొత్తు, అను వెస వారసులు. 

# సంధ్యా సమయం దాటింది.

## చిరు చీకట్లు ముసురుకుంటున్నాయి.

## కన్పడీ కన్పడనట్లు చుక్కలు – వెలిగీ వెలగనట్లు శుక్లపక్షపు తొలిరోజుల వెన్నెల.

ఎండకు కృశించిన మూసీ నదిలా ఆమె సాగుతున్నది. ఎండాకాలపు సాయంకాలపు వడగాడ్పులాంటి నిట్టూర్పులు, గ్రీష్మ తాపాల్ని మించిన మనస్తాపపు తాండ్రింపుతో ప్రవహిస్తున్నవి ఘర్మధారలో అశ్రుధారలో మరి తెలియడంలేదు.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్



సీరియల్

# హ్యూమానిటీ ఫర్ సేల్

కాలి నడకన ఆమె నారాయణగూడా మీదుగా బరకత్ పురా చేరింది. లింగంపల్లి పూల్ దగ్గర ఆగింది.

ఇరానీ హోటల్‌లో జనసమ్మర్దం.

దిక్కులు చూస్తూ ఏవో గుర్తులు వెతుక్కుంటూ మరి నాలుగడుగులు ముందుకు వేసింది.

మేదరి చంద్రయ్య తల వంచుకొని నిర్విరామంగా బుట్టలు అల్లుతూనే వున్నాడు.

'చూడయ్యా ఇక్కడ డాక్టర్ రాజు దవాఖానా ఎక్కడ ?'

'అదుగో - ఆ ఎదురుగా వున్న పెద్ద మేడ' తల ఎత్తకుండానే జవాబిచ్చి పనిని నిర్విఘ్నంగా సాగించుకు పోతున్నాడు -

ఆమె ఎవరు? ఎందుకు అడుగుతున్నది? అన్న ప్రశ్న చంద్రయ్యకు లేదు - చంద్రయ్యకిదేమీ కొత్త కాదు.

ప్రతిరోజూ ఇదే తంతు.

ఇదే ప్రశ్న.

ఇదేరకం మనుషులు.

ఇదే రకం నడక.

చంద్రయ్య సామాన్యుడు - ధూళి ధూసరితమైనరోడ్డు పక్క కేవలం బుట్టలల్లి బతికే ఒక గుర్తింపులేని జీవి.

సాక్షీ మాత్రుడుగా కూర్చోవడం కన్నా ఏం చేయగలడు ? రోడ్డుమీద ఊళ్ళను మైళ్ళను సూచిస్తూ చౌరస్తాలో నిలిపిన దిక్సూచిలా, గడ కర్రలా డాక్టరు రాజు ఇంటికి చంద్రయ్య ఒక దిక్సూచి. నిమిత్తమాత్రుడు.

ఆమె ముందుకు సాగిపోయింది.

తడబడుతున్న అడుగులతో డాక్టరు రాజు భవనాన్ని సమీపించింది.

కింద బంట్రోతు వున్నాడు.

" రాజుగారున్నారా " ఆమె హిందీలో ప్రశ్నించింది.

" ఉన్నారమ్మా, ఇటు, ఈ మెట్లెక్కి పైకి పొండి "

మెట్లెక్కి పైకి వెళ్ళింది.

గది గుమ్మానికి కర్టెన్.

" మే ఐ కమిన్ సార్ "

" ప్లీజ్. కమిన్ " గంభీరమైన కంఠస్వరం లోపలి నుండి.

ఆమె నేరస్థురాలిగా న్యాయస్థానంలో బోనులో నిలబడ్డ ముద్దాయిగా లోనికి ప్రవేశించి నిలబడింది.

" కూర్చోండమ్మా, ఆ సోఫాలో కూర్చోండి, మీకిక్కడ ఏమి భయం లేదు. శ్యామూ "

శ్యామ అయ్యంగార్ వచ్చాడు.

" ఓ అయిస్‌క్రీమ్ పట్రా "

" నో థాంక్స్ " ఆమె చాలా సవినయంగా అన్నది.

" ఫరవాలేదు. మా మర్యాదకోసం తీసుకోండి " డాక్టరు రాజు అయిస్ కన్నా చల్లని మాటలు ఆమెకు కొంచెం ఊరటను కలిగించాయి. తలెత్తి చూచింది. ఎదురుగా గోడకు హిపోక్రట్ నీతివాక్యాలున్న పటం !! దానికింద ధర్మమూర్తిలా కూర్చున్న డాక్టర్ ధన్వంతరి, డాక్టర్ రాజు !!

శ్యామ్ అయిస్‌క్రీమ్ కోసం కిందికి వెళ్ళాడు.

డాక్టర్ రాజు నోట్‌బుక్ తీసుకున్నాడు. " ఆc నిర్భయంగా మీ కేసు వివరాలన్నీ చెప్పండమ్మా - ఇదుగో చూడు, ఈ గదిలో మీరు నేనూ తప్ప మరెవరూ లేరు - అందుకని ఏమీ మొగమాటపడ నక్కరలేదు. నేను పరాయివాణ్ణి కదా అని సంకోచపడనక్కరలేదు. నీ తండ్రి లాంటి వాణ్ణి. నిర్భయంగా నీవు చెప్పదలచుకున్నదంతా చెప్పమ్మా, నీ పేరు. "

" ఎక్కడ వుంటావు "

"......................"

" ఉద్యోగం "

"......................"

ఆమె మౌనం — కొన్ని నిశ్శబ్దక్షణాలు.

పైన సీలింగ్‌ఫాన్ చేస్తున్న చిరుసవ్వడి తప్ప రాజుకు ఆమె మాట్లాడకపోవడం వింతగా కన్పడలేదు.

ఆయనకూ ఇది కొత్తకాదు - అలవాటే - ఓసారి అరిచేత్తో నుదురు తుడుచుకొని కాగితమూ కలమూ ఆమె చేతికి ఇచ్చాడు.

" చూడమ్మా - నోటితో చెప్పడానికి నీ కంత సిగ్గయితే అదుగో ఆ లెటర్‌పాడ్ మీద వివరాలు వ్రాయి - నీ పేరూ అడ్రసూ, కేసు వివరాలు ఒక కథ వ్రాసినట్లు వివరంగా వ్రాయి - సిగ్గుపడి ఏమీ దాచకు. దానివల్ల ప్రయోజనంలేదు. అదుగో ఆ అవతల రూములోకెళ్ళి వ్రాసుకొనిరా, పోమ్మా ".

వణుకుతున్న చేతులతో ఆమె కాగితమూ కలమూ తీసుకుంది. అడుగులో అడుగువేసుకుంటూ పక్క గది లోపలికి వెళ్ళింది.

ఫోన్ గుర్ గుర్ గుర్ మని శబ్దం.

" హల్లో-ఆc-మిస్టర్ రాజూ స్పీకింగ్ - అవునయ్యా డాక్టర్ రాజునే ఎవరు మీరు : బంజారాహిల్స్ నుంచా ? చెప్పండి, చెప్పండి. ఆc-హల్లో-వింటున్నాను చెప్పండి

## చైత్రం మళ్ళీ వచ్చింది!

నిండు శిశిరంలో ఆకులు రాలినట్లు
ఎన్ని ఆలోచనలు ఈ గట్టుదాటి వెళ్ళిపోయాయో
ఈ సులోచనాలు చూస్తూనే ఉన్నాయి.
మసక మసక అక్షరాలలో గ్రీష్మతప్త జీవిత
చిత్రాలను.

హేమంతాన్ని చూచి జడుసుకున్న వృద్ధాప్యం
ఎవరి ఆప్యాయనం కోసం పరితపిస్తోందో మరి
ఏ నిగారింపూ లేక ముడతలు పడ్డ ఈ ఒంట్లో
ఎక్కడో శరత్కాలపు వెన్నెల కాస్తోంది.

కుంభవర్షంలో తడిసి ముద్దయిపోయిన అనుభవాలు
జ్యేష్ఠ మాసపు వేడిగాలుల్లా లేచిన కోరికలు
భోగిమంటలై చలిని తీర్చగలిగాయి కానీ
వదలిపెట్టని అతిథుల్లా ఇంకా వెన్నంటే వస్తున్నాయి.

నవ చైతన్యాన్ని నింపుకున్న ఈ మానస మురళి
వసంతగీతాన్ని తరచూ వినిపించకపోతే
నిలకడలేని ఈ మోడు కాడులో కలిసి ఉండేది తప్ప
ఇంత చిత్రంగా చైత్రంగా వికసించి ఉండేది కాదు.

– డా॥ గుమ్మనూరు రమేష్‌బాబు

ఆఁ నోట్ చేసుకుంటున్నాను. యస్ యస్ యస్ .... ఊఁ.... అబ్బే ఈ వివరాలు లాభంలేదు, ఏమిటీ చెప్పరా? అయితే మానెయ్యండి – మంచిది. ఓ వెయ్యి రూపాయలవుతుంది. చూడండి ఇవ్వాళ రేపు కాస్త తీరికవుంది – ఆ తరువాత ముందే ఫిక్స్ అయిన ఎంగేజ్‌మెంట్స్ ఆఁ – అన్నీ అప్పాయింట్‌మెంట్స్ – రేపా ? మంచిది రండి. ”

ఫోను పెట్టి నుదురు తుడుచుకున్నాడు మళ్ళీ రాజు.

శ్యాను అయ్యంగార్ రెండు ఆయిస్‌క్రీములు తెచ్చాడు.

“ శ్యామూ, నారాయణగూడా కారు పెట్రోలు పోయించుకురా ”

“ అలాగే ” శ్యాం నిష్క్రమణం.

గదిలోనుండి ఆమె లేచింది కలమూ కాగితాలతో. భయభయంగా చూస్తూ డాక్టరు రాజు కూర్చున్న కుర్చీ సమీపానికి వచ్చింది. రాజు నవ్వాడు.

“ చూడమ్మా నీ సీక్రసీ కొచ్చిన ప్రమాదమేమీ లేదు. నీ ప్రాణానికి నా ప్రాణ మిస్తాను. నీతో మాట్లాడాలనే మా కాంపౌండర్ని కూడా ఏదో మిష పెట్టి నారాయణగూడా పంపాను. ఇలాతే ”

ఆమె తాను వ్రాసిన ఉత్తరం ఆయనకిచ్చింది – రాజు చదివాడు. నిట్టూర్చాడు. ఒక్కక్షణం ఆగి అన్నాడు. “ ఇదేమీ కొత్త కథ కాదమ్మా, మనకొచ్చే కేసెస్‌లో నూటికి డెబ్భైకి పైగా ఇలాంటివే. నీకొచ్చిన భయమేమీ లేదు. రెండవ కంటివారికి కనపడకుండా రేపు క్లినిక్‌లో చేరు. చాలా మైనర్ ఆపరేషన్ – ఏమమ్మా – ఏం ? ”

“ డాక్టరుగారూ, మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను. నేనేం పెద్ద మేధావిని కాను. లేదా ఇంద్రియ నిగ్రహంకల యోగినినీ కాదు. అతి సామాన్య మానవ మాత్రురాలిని. కాబట్టే కాలు జారింది, నన్ను మీరే రక్షించాలి ”.

“ ఇక పరితాపం పడకూడదు తల్లీ, అన్నిటికీ పరమేశ్వరుడే వున్నాడు. ఆయన ఆదేశాలను నీవూ నేనూ ఎవరూ ఉల్లంఘించకూడదు ”.

“ తెలిసికూడా శిశుహత్యకు పూనుకొన్న కిరాతకిని. ”

ఆమె కన్నులు ఆర్ద్రాలైనాయి.

“ అలాంటి అనుమానాలేమీ పెట్టుకోవద్దు తల్లీ. ఏదైనా పాపముంటే అదంతా ఈ డాక్టరు రాజుగాడికే చుట్టుకుంటుంది. నీవు విశుద్ధురాలివి. స్పటికంలాంటి దానివి. అద్దంలాంటి దానివి. ” ( సశేషం )

# మిడిగుడ్ల గుడ్లగూబ - డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు


మిడిగుడ్ల గుడ్లగూబ

చీకటి పడుతుండగా మిగిలిన పక్షులన్నీ విశ్రాంతి కోసం గూటికి చేరుకుంటాయి. కాని అదే సమయంలో నిద్రలేచి బద్ధకంగా రెక్కలు విదిలించి గూటిలోంచి తొంగి చూసే పక్షి గుడ్లగూబ. నెమ్మదిగా దిక్కులు సారించి ఒక్క ఎగురున దగ్గరలోనున్న చెట్టు కొమ్మనో, ఇంటి గోడనో చేరి తనదైన ప్రత్యేక కూతను వేస్తుంది. అప్పటితో ఆ రోజుకు తన జీవనం ఆరంభమైనట్టు లోకానికి తెలియచేస్తుంది. ఈ నిశాచరం జీవనం, ఏడుపులా వుండే కూత, మిగతా పక్షులకన్నా భిన్నంగా ముందుకు పొడుచుకు వచ్చిన అతి పెద్దకళ్ళు - వీటన్నిటి వలన గుడ్లగూబ అంటే మానవుడికి అసహ్యం, భయం ఏర్పడ్డాయి. గుడ్లగూబను అశుభానికి చిహ్నంగా ప్రపంచంలోని అనేక దేశాల ప్రజలు భావిస్తారు. కాని గుడ్లగూబ మానవుడికి చేస్తున్న సేవను తెలుసుకున్నప్పుడు మనం పెంచుకున్న ఏహ్యాభావానికి అర్థం లేదనిపిస్తుంది. మనం పండించుకుంటున్న ఆహారంలో చాలా భాగాన్ని దోచేసే ఎలుకలు, పందికొక్కులు మొదలగు వాటిని పట్టి తింటూ మనకెంతో సహాయపడుతోంది గుడ్లగూబ.

అరవై మిలియన్ సంవత్సరాల క్రితం ప్రకృతిలోకి వచ్చిన గుడ్లగూబ నేడు నూటముప్పైరెండు జాతుల రూపంలో అన్ని ఖండాలలో నివసిస్తున్నది. పెద్ద తల, కురచ తోక, అతి పెద్దవైన కళ్ళు, కళ్ళచుట్టు నల్లని చార లాంటి వృత్తము, వంకి తిరిగిన ముక్కు, పదునైన కాలి వేళ్లు - ఇవి గుడ్లగూబ లక్షణాలు. పది సెం. మీ. నుంచి రెండు అడుగుల వరకు వుండే ఈ గుడ్లగూబల ఈకల మీద చారలు, మచ్చలు వుంటాయి. కొన్నింటికి తలమీద ఈకలు కొమ్ముల్లా నిలుచుని వుంటాయి.

చీకటిలో జీవనం గడిపేందుకు వీలుగా గుడ్లగూబ శరీరంలో అనేక మార్పులు వచ్చాయి. పూర్తి చీకటిలో కూడ గుడ్లగూబ చూడగలదు. మానవుడి కళ్ళకన్నా ఈ పక్షి కళ్ళు వంద రెట్లు అధికశక్తి కలవి. అదే విధంగా వినికిడి శక్తికూడా బాగా అభివృద్ధి చెందింది. చీమ చిటుక్కుమన్నా, గుడ్లగూబ గ్రహించగలదు. ఎలుకలు, పందికొక్కులు మున్నగునవి నడిచేప్పుడు చేసే అతి తక్కువ శబ్దాన్ని కూడా గ్రహించటం వల్లనే వాటిని పట్టుకోగలుగుతున్నాయి. గుడ్లగూబ శరీరం మీది ఈకలు పట్టులా అతి మెత్తగా వుంటాయి. అందువలన గుడ్లగూబ ఎగిరేప్పుడు ఎటువంటి శబ్దము రాదు. ఎలుకలకు గుడ్లగూబ వస్తుందనే విషయం ఎటువంటి పరిస్థితిలోను తెలియదు.

గుడ్లగూబలు తమ అరుపులతో సంకేతాలను అందించుకుంటాయి. సంతానోత్పత్తి సమయంలో ఆడపక్షి మాత్రమే అరుస్తుంది. మగపక్షి ఆ సందేశం కోసం ఎదురుచూస్తుంది. ఇవి సాధారణంగా సొంతంగా గూడు

(మిగతా 18 వ పేజీలో)

# పుస్తక సమీక్ష

## చిరుతరగలు : (మినీ కవితల సంకలనం)

ప్రచురణ : త్రివేణి సాహితీ సంస్థ, కరీంనగర్_505 002

వెల లేదు

ఇది వృత్తిరీత్యా భిన్న భిన్న రంగాలకు చెందిన పలువురు కవుల కవితా సంకలనం. మినీ కవితలని ప్రచురణ కర్తలు పేర్కొన్నా ఈ కవులకు మినీ కవిత మీద పూర్తి అవగాహన వున్నట్లు లేదు. వీటిని మినీ కవితలు అని అనటం కంటే చిరువచనకవితలుగా పేర్కొనటమే సముచితం !

" చదువుకొన్నా - సంస్కారం అంటని హీనులు - ఈ జాతికి పట్టిన చీడపురుగులు" వంటి సామాజిక రుగ్మతలను బయటపెట్టే కవితలతోపాటు, మేధావీ ! మేలుకో అనే సందేశాలూ - కనబడని దేవునికోపం హుండీలు నింపే దాతలు_కనబడే పేదలమీద త్యాగ నిరతి చూపరనే చురకలూ - గోడలు సైతం నినాదాలు మోస్తున్నాయ్ - మౌనంగా గర్జిస్తున్నాయ్ - ఉద్యమాలు నిర్మిస్తున్నాయ్ - తమ పాత్ర నిర్వహిస్తున్నాయ్ - మరి మీ సంగతేమిటని పాఠకులకు గురిపెట్టే ప్రశ్నలూ - ప్రజల్ని మోసగించే నాయకులకు హెచ్చరికలూ - రాయికి శిల్పి, ప్రకృతికి రవి ప్రాణం పోసినట్లే కవి సమాజానికి ప్రాణం పోస్తాడనే విశ్వజనీక సత్యాలూ ఇందులో వున్నాయి. భిన్న భావాల సమాహారంగా ఈ సంకలనం మనకు కనిపిస్తుంది.

ప్రతి కవిత కింద కవిని గూర్చిన సంక్షిప్త పరిచయం కూడా ఇచ్చారు. ఇది ఇతర సంకలన కర్తలకు కూడా ఆదర్శప్రాయంగా వుంటుంది.

ఈ సంకలనంలోని కవులలో కొందరు " శుష్క వచనం " నుంచి బయటపడి వచనకవితని ఇంకా వశం చేసుకొంటే భవిష్యత్తులో మంచి వచనకవితలు పండించే అవకాశం వుంది.

## హృదయాన్వేషణ : ( గేయ సంపుటి )

గేయకర్త : గరిశకుర్తి రాజేంద్ర (" సంధ్య ")

ప్రతులకు : గరిశకుర్తి రాజేంద్ర, పోస్టల్ అసిస్టెంటు కామారెడ్డి - 503 111 నిజామాబాద్‌జిల్లా, వెల : రు. 2

" పరిసరాల్ని నిశితంగా పరిశీలించి, స్పందించి, ఎగిసిపడుతున్న ఆలోచనా తరంగాలకు అక్షర రూపం ఇచ్చే ప్రయత్నంలో భాష కరువై, భావాలు చెదరిపోగా మిగిలిన భావావేశం అక్షరరూపం దాల్చగా ఏర్పడిందీ " హృదయాన్వేషణ " - అని కవి తన ' ప్రేరణ ' శీర్షికలో దాపరికం లేకుండా చెప్పడంలోనే ఈ కవి అన్వేషణా దృష్టి మనకు అవగతమవుతుంది. ఇందులో ప్రణయ గేయాలు, ప్రగతిగేయాలు, ప్రబోధ గేయాలు చోటు చేసుకొన్నాయి. " మనిషివి నీవైతే మంచిగ మసలుకో మానవజన్మమే వరమని తెలుసుకో - మనిషంటే ఎవడురా? మనసున్నా ఘనుడురా ! " మొదలైన గేయాలు ఆలోచనా మార్గంలో అన్వేషణకు పాఠకుల్ని పురికొల్పుతాయి.

" రైతన్నా " వంటి గేయాలు పాడుకోటానికి వీలుగా మిక్కిలి ప్రబోధాత్మకంగా ఉన్నాయి.

కామారెడ్డిలో పోస్టల్ అసిస్టెంట్‌గా పనిచేస్తూ కవితా హృదయాన్వేషణం చేస్తున్న ఈ కవి లక్ష్యం సిద్ధించాలంటే ఇంకా కృషి అవసరం -

**- జోరాశర్మ**

## గుడ్లగూబ (17 వ పేజీ తరువాయి)

కట్టుకోవు. చెట్టు తొర్రలను, రాళ్ళ పగుళ్ళను, లేదా గద్ద, వడ్రంగిపిట్టలు వదిలేసిన గూళ్ళను ఉపయోగించుకుంటాయి. ఒకటినుంచి నాలుగు గుడ్ల వరకు పెడతాయి. ఆడపక్షి గుడ్లను పొదుగుతుంది. పిల్ల గుడ్లగూబలకు విపరీతమైన ఆకలి. చాలా పిల్లలు ఆహారం సరిపోక మరణిస్తుంటాయి.

ఆహారం దొరికేదాన్ని పట్టి గుడ్లగూబలు సంతానాన్ని పెడతాయి. ఆహారం సరిగా లభించని సంవత్సరంలో ఆడపక్షియి జోడు కట్టటానికి ఇష్టపడవు. ఆహారం సమృద్ధిగా లభించిన సంవత్సరంలో గుడ్లను ఎక్కువ సంఖ్యలో పెడతాయి.

## ఆదిశంకరులు

# శ్రీ జగద్గురు శంకరాచార్య

కొమరగిరి కృష్ణ మోహనరావు

**భారత** దేశంలో నాస్తికవాదం తీవ్ర రూపం దాలుస్తున్న దినాలలో హిందూమత ధర్మ, సంస్కృతీ పరంపరలను గురించి తూలనాడుతూ, దురాచారాలను ప్రోత్సహిస్తూ, ధర్మాన్ని శంకిస్తూ, ఆ ధర్మాన్ని ప్రబోధిస్తూ, నాస్తిక భావాలను ప్రచారంచేస్తూ, నైతిక, ఆధ్యాత్మిక విలువలను కించపరుస్తూ, సమాజంలో తీవ్ర అశాంతిని కలుగజేస్తున్న సమయంలో "జ్ఞానభాస్కరుడు" ఉదయించాడు. జ్ఞాన శూన్యులై అజ్ఞానాంధకారంలో పయనిస్తున్న ప్రజానీకానికి దివ్య జ్యోతిని ప్రసాదించాడు. దేశ గతినే మార్చి వేశాడు. హిందూధర్మ ఔన్నత్యాన్ని వాడవాడ ప్రబోధించాడు. ఆత్మవిస్మృతి జెంది నిద్రాణమై యున్న జాతిలో నవ చైతన్యాన్ని కలుగజేసి హిందూ మతం యెడల ప్రగాఢమైన విశ్వాసాన్ని పునః ప్రతిష్ఠించాడు. ప్రయాణ సౌకర్యాలు లేకపోయినా, రాజాదరణలు లభించకపోయినా, ఆత్మవిశ్వాసంతో, అకుంఠిత దీక్షతో ఆసేతు హిమాచల పర్యంతం, పరివ్రాజకుడై కాలినడకన పర్యటన చేసి జాతిని తిరిగి తేజోవంతం చేశాడు. దేశ సమైక్యతను కాపాడాడు. కన్యాకుమారి నుండి హిమాలయాల వరకు గల భారత ప్రజలు ఆ మహనీయునికి మోకరిల్లారు. నీరాజనాలర్పించారు. ఆ యుగపురుషుడే "ఆదిశంకరులు జగద్గురు శ్రీ శంకరాచార్య."

భారత వర్షంలో కేరళ ప్రాంతంలో "కాలడీ" అనే కుగ్రామంలో ఆ మహనీయుడు నందననామ సంవత్సర, వైశాఖ శుద్ధ పంచమి, ఆదివారం, పునర్వసు నక్షత్ర శుభ సమయమున అవతరించారు. ఇదే శకానుసారము 2593 సం. అనగా క్రీ. పూ. 509 సం. తండ్రి శివగురువు. పరమ శివ భక్తాగ్రేసరుడు. తల్లి ఆర్యాంబ. చిన్న వయసులోనే సకల శాస్త్ర పారంగతుడైనాడు. వీరికి చౌలోపనయనాదులు యథాకాలంలో యథావిధిగా, విధివిధానంతో నిర్వహించబడినాయి. మధూకర వృత్తితో నియమ పూర్వకంగా, గురు సాన్నిధ్యంలో చతుర్వేదాధ్యయనం చేశారు. ఆ సమయంలోనే వీరు ఒక బీదరాలగు బ్రాహ్మణ గృహిణి వలన "అమలక" భిక్షను స్వీకరించి, శ్రీ మహాలక్ష్మిని "కనకధారా స్తవంతో" స్తోత్రము చేయగా, ఆమె గృహపరిసరమంతటా సువర్ణామలక వృష్టి కురిసిందని చరిత్ర చాటుతున్నది.

ఒకరోజున తల్లి వృద్ధాప్యంవల్ల నిత్యమూ చేయు స్నానము చేయలేకపోవడం చూచి శంకరులు నదీ ప్రవాహపు జాలునే త్రిప్పి తన ఇంటి పక్కగా పారునట్లు చేసిరట. అంతట తల్లి ఆర్యాంబతో కలిసి ఆ "చూర్ణి" నదిలో స్నానము చేయుచుండగా ఒక మొసలి శంకరుని కాలు పట్టుకొనెను. అప్పటికే శంకరుల తండ్రి గతించెను. భర్త పోవడమేగాక, కొడుకు కూడా పోతున్నాడేఅని ఆ తల్లి ఎంతో బాధపడుచుండెను. మొసలి నదిలోనికి ఈడ్చుకొని పోవుచుండగా శంకరులు "అమ్మా! మొసలి ఈడ్చుకొని పోవుచున్నది. సన్యాసం స్వీకరించడానికి అనుమతి యిస్తే వదలివేస్తుంది, లేకపోతే తీసుకుని పోతుంది. మొసలి నోటబడి మరణించిన యెడల అది దుర్మరణమగును. నీకు పుత్రకృత్యము చేయువారుండరు. సన్యాసమునకు నీవు అనుమతియిస్తే దుర్మరణము తప్పుతుంది. నీతోపాటు ఇరువది ఒక్క తరముల వారు కూడా తరించుదురు." అని కేకలు పెట్టగా, పిల్లవాడు

బ్రతుకుతే అంతే చాలునని సన్యాసం స్వీకరించడానికి తల్లి అంగీకరిస్తుంది. అంత శంకరులు ప్రైష మంత్రమును ఉచ్చరించి సన్యాసి యాయెను. మొసలి మటుమాయమయ్యెను.

తల్లికడ సెలవు తీసుకొని పరివ్రాజకుడై నర్మదానది తీరానమున్న గోవింద భగవత్పాదుల వద్దకు వెళ్ళి తమను తామే పరిచయం చేసుకొని "శివం కేశవోஉహం" అనే మకుటంగల దశశ్లోకిని చెబుతారు. "గోవిందం పరమానందం, మద్గురుం ప్రణతోస్మ్యహం" అని ప్రణామం చేస్తారు. అప్పుడు వారు వ్రాసిన "భజగోవింద స్తోత్రము" గురుపరముగను, దైవపరముగను వెలయుచున్నది. శ్రీ గోవింద భగవత్పాదులు ఆనందంతో అనుగ్రహించి, శిష్యులుగా స్వీకరించి మహావాక్యోపదేశాన్ని చేస్తారు.

గురువాజ్ఞ శిరసావహించి వింధ్య పర్వతములను దాటి కాశీ పట్టణానికి చేరుతారు. అది మహా పండితులకు నిలయం. పదునారు వత్సరాల ప్రాయంలో దేదీప్యమానంగా వెలిగిపోతున్న ఆ బ్రహ్మచారి, బ్రహ్మతేజస్సును చూచి పండితులంతా తలలొంచి మొకరిల్లుతారు. అచటనే వీరు బ్రహ్మ సూత్రములకు, ఉపనిషత్తులకు, భగవద్గీతకు భాష్యములు రచించుతారు. వీటికే "ప్రస్థాన త్రయభాష్యములు" అని పేరు. వీరిచే "సనత్సు జాతీయ భాష్యం" కూడా ఇచటనే రచింపబడినది. "మనీషా పంచకం" కూడా ఇచటనే చెప్పబడింది. అంతేకాదు, ఆ పవిత్ర కాశీక్షేత్రంలోనే వేదవ్యాసుల వారితో బ్రహ్మసూత్ర భాష్యంలోని "తరంతర ప్రకరణం" పై గోష్ఠి కూడా జరిగిందట. వీరికి అనేక మంది శిష్యులైనారు. వీరిలో "సనందనుడు" ముఖ్యుడు. ఆయనే "పద్మపాదాచార్యులు" గా ప్రసిద్ధులయ్యారు. తరువాత "హస్తమలకాచార్యుల"ను శిష్యులుగా స్వీకరిస్తారు. పిమ్మట "ఆనందగిరి"ని శిష్యులుగా చేర్చుకుంటారు. వీరినే "తోటకాచార్యులు" అని అంటారు. తోటకవృత్తంలో శంకరులను స్తోత్రం చేయడంవలన

శ్రీ చంద్రమౌళీశ్వరాయ నమః

మాతృభక్తి, పితృభక్తి, ఆచార్య భక్తి, అతిథిభక్తి, పతిభక్తి మొదలగునవి మానవ జీవితంలో చాలా ముఖ్యమైనవి. ఇండియా కళాచారము, నాగరీకము, ఆత్మీకము, మొదలగునవి తరతరాలనుండి వస్తూయున్నవి. ఇవన్నిటిని గురించి ప్రజలకు విపరంగా తెలియజేయుటకు 'శ్రీవాణి' తెలుగు మాస పత్రిక వెలువడుతున్నందుకు సంతోషము. ముందు ముందు ఇంకా మంచి విషయములను ప్రచురణ చేస్తూ ప్రజలకు ఉపకారముగా యుండుటకు ఆశీర్వాదము చేయుచున్నాము.

వారణాసి
28-3-1986

నారాయణ స్మృతిః
శ్రీ జయేంద్ర సరస్వతీస్వామి
కంచి కామకోటి పీఠాధిపతి

ఆనందగిరికి "తోటకాచార్యులు" అని పేరు వచ్చింది. వీరి తోటకాష్టకంలోని తత్వ సమన్వయం మహామహులను ముగ్ధులను చేసింది. తుదకు సురేశ్వరులను శిష్యులుగా పరిగ్రహిస్తారు. వీరి పూర్వాశ్రమనామం "మండన మిశ్రుడు". వీరు శంకరులతో వాదన సలిపి, వారి జ్ఞాన మార్గాన్ని అంగీకరించి శిష్యులై, శ్రీవారికి ప్రీతి పాత్రులైనారు.

ఆదిశంకరులు భారత వర్షమంతా రెండు పర్యాయములు విజయ యాత్ర చేశారు. మొదటి పర్యాయం బౌద్ధ, జైన మతాలవల్ల మితిమీరి ప్రబలిన నాస్తిక భావాలను ఖండించి అద్వైత జ్ఞానమును ప్రబోధించారు. రెండవ పర్యటనలో సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలను దర్శించి, జీర్ణావస్థలోనున్న వాటిని పునరుద్ధరించి, వాటి మహత్తును

గురించి అనేక స్తోత్రములను చేశారు. పుస్తకాలను వ్రాశారు. కైలాసానికి వెళ్ళి సదాశివుణ్ణి "వేదాంత చూర్ణిక" లో స్తోత్రం చేసి అచటనుండి ఐదు స్ఫటిక లింగములను; శాస్త్ర పరము, మంత్రశాస్త్ర సమ్మతము అయిన "సౌందర్యలహరి" అనే గ్రంథమును ( ఇందు ఆనందలహరిని మాత్రం ) భువికి తీసుకొని వచ్చారు.

కాశ్మీరులో ప్రతిష్ఠించబడియున్న సర్వజ్ఞ పీఠాన్ని అధిరోహించుతారు. మండన మిశ్రుని (శ్రీ సర్వేశ్వరులు) ధర్మపత్ని సరసవాణి (ఉభయ భారతి) తో ఎంతో క్లిష్టమైన శాస్త్ర చర్చలను జరిపి ఆమెను జయించుతారు. ఆమె సరస్వతీ అవతారమని ప్రతీతి. తుంగభద్ర నదీ తీరాన శృంగేరీ మఠాన్ని స్థాపించి శక్తి స్వరూపిణిగా "శారదాదేవి" అనే పేరుతో సరస్వతిని ప్రతిష్ఠించుతారు. దానికి తమ శిష్యులైన "పృథ్వీధరుల" ను మఠాధిపతిగా నియమించుతారు. ఉత్తరాన బదరీ నారాయణంలో "జ్యోతిర్మఠాన్ని స్థాపించి, ఆనందగిరి (తోటకాచార్యులు) ని అధిపతుల్ని గావించుతారు పశ్చిమాన ద్వారకా మఠమును స్థాపించి హస్తమలకాచార్యులను అధిపతులను చేస్తారు. తూర్పున మహోదధీ తీరంలో పూరీ గోవర్ధన మఠమును ప్రతిష్టించి, దానికి పద్మపాదాచార్యులను అధిపతులుగా నియమించుతారు. కాశీలో "సుమేరు" లేక "పాదుకా" పీఠాలను ప్రతిష్టించుతారు.

కైలాసంనుంచి తెచ్చిన ఐదు స్ఫటిక లింగాలలో భోగ లింగాన్ని శృంగేరీలో, మోక్షలింగాన్ని చిదంబరంలో. వర లింగాన్ని నేపాలంలో, ముక్తి లింగాన్ని కేదారంలో ప్రతిష్టించి ఐదవ లింగాన్ని కంచిలో ప్రతిష్టించుతారు. శ్రీరంగంలో జనాకర్షణ యంత్రాన్ని, తిరుమల శ్రీ వెంకటేశ్వర క్షేత్రంలో ధనాకర్షణ యంత్రాన్ని ప్రతిష్టించుతారు, తిరుచునాపల్లి వద్దనున్న జంబుకేశ్వరంలో గణపతిని ప్రతిష్టించి అఖిలాండేశ్వరీదేవి ఉగ్రరూపాన్ని తగ్గిస్తారు.

కన్యాకుమారీనుండి కాశ్మీరం వరకు, ఇటు మహోదధి నుండి అటు రత్నాకరం వరకు పర్యటించి నాలుగు మూలలా నాలుగు మఠములను స్థాపించి కంచిని కేంద్రంగా చేసుకొని అద్వైత బ్రహ్మవిద్యా ప్రచారం గావించి, దేశంలో విభిన్న సాంప్రదాయాలు, భావాలు, భాషలు ప్రజలున్నప్పటికీ - వీరంతా ఒకే సంస్కృతీ ధర్మ పరంపరలకు వారసులమనే భావాన్ని ప్రచారంచేసి, అనేక పుణ్యక్షేత్రాలను దర్శించి, యంత్ర పతిష్ఠలు చేసి, అచ్చటి దివ్య తేజస్సును దేదీప్యమానం చేసి భారతదేశ సమైక్యతను సమగ్రతను పరిరక్షించి ప్రజలలో నవ చైతన్యాన్ని కలుగజేసిన మహనీయులు, యువ ప్రవక్త అయిన ఆదిశంకరులు 32 వ సంవత్సరంలో అనగా కీ. పూ. 477 సం. లో కాంచీక్షేత్రంలోని కామాక్షిదేవి ఆలయంలో అవతారం చాలిస్తారు.

ఆ మహనీయుని చరిత్ర మనకు అత్యంత పవిత్రమైనది. ధర్మం క్షీణించి, అధర్మం ప్రబలుతున్నప్పుడు సాధు సజ్జనులను సంరక్షించి, దుర్మార్గులను హతమార్చి ధర్మ ప్రతిష్ఠాపన గావించుటకు పరమాత్మే స్వయముగా మానవరూపంలో అవతరించుతాడని భగవద్గీత బోధించిన నగ్న సత్యమును ఆదిశంకరుల జీవితం ఋజువుచేస్తున్నది. ఆ మహనీయుని స్మరించుట మన ప్రప్రథమ కర్తవ్యం, విద్యుక్త ధర్మం,

ఆదిశంకరుల జీవిత సంగ్రహం ఈ క్రింది శ్లోకంలో సంగ్రహించబడింది.

> "అష్టవర్షే చతుర్వేదీ
> ద్వాదశే సర్వశాస్త్రవిత్
> షోడశే కృతవాన్ భాష్యం
> ద్వాత్రింశే మునిరభ్యగాత్"

ఎనిమిదేండ్ల నాటికే చతుర్వేద (నాలుగు వేదములు) విదుడయ్యెను. పండ్రెండేడ్ల ప్రాయముననే సర్వ శాస్త్ర పారంగతుడయ్యెను. పదునారేండ్లకే బ్రహ్మ సూత్రాలకు భాష్యం చెప్పెను. ముప్పదిరెండు సంవత్సరములకే మునియై తనువు అవతారమును చాలించెను. 

# ధృతరాష్ట్రుని నిశ్చయం

భారతేతిహాసం వ్యాసునిచే రచింపబడింది. వ్యాసుడు భారతానికి కవే కాక, అందులో ఒక పాత్ర కూడా అవడమొక విశేషం. అయితే ఆయన ప్రవేశ మెల్లవేళలా కనబడదు. ఆయన ఏ ఒక్క కార్యాన్నీ ఎవరికీ సాధించిపెట్టలేదు. కాని ధర్మానికి సంబంధించిన అనుమానాలనూ అపోహలనూ తీర్చ వలసిన అవసర మున్నప్పుడు పరాశరుడు ప్రత్యక్ష మవుతాడు. పంచపాండవులు ద్రౌపదిని వివాహమాడా లనుకున్నారు. ఇది ధర్మమేనా ? అన్న శంక కలిగినప్పుడు, ఆ శంకను ద్రుపదునికి తీర్చడానికి ప్రత్యక్షమయాడు. అనుశాసనిక పర్వంలో నీతులన్నీ విన్నతర్వాత, భీష్ముడు పరలోక గతుడవడాన్ని చూసి, శోకంలో యధాస్థితికి వచ్చిన ధర్మరాజును హెచ్చరించడానికి పరాశరుడే అవ సర మయాడు.

వడలి మందేశ్వరరావు

“ నిష్ఠించి యిబ్బంగి– నీకేమి సెప్పిన, వాక్యంబు లెల్లను– వఱదఁ గలసి పోయెనే ? నీదగు– బుద్ధి యింతొప్పదో ? ”

– అశ్వ– 1–12

అని ధర్మరాజును మందలించడానికి, పరాశరునికి తప్ప మరెవరికీ చనువు కాని, పెద్దరికం కాని, సామరథ్యం కాని లేవు. వ్యాసుడు కథలో అవతరించిన తావులన్నీ –ఇంచు మించుగా– ఇట్టివే.

ఆశ్రమ వాస పర్వంలో వ్యాసుడు రెండు మార్లు ప్రత్యక్ష మవుతాడు.

భారత యుద్ధం తర్వాత పదునైదు సంవత్సరాల అనంతరం– ఒకనాడు ధృతరాష్ట్రుడు “బంధు జనంబులం గూర్చి, ధర్మనందను రావించి, యతండు వినుచుండ గద్గద కంఠుండగుచు, ” వాళ్ళతో తాను వనవాసానికేగ నిశ్చయించినట్లు తెలియపరిచాడు.

తన మూలానే కౌరవులకు నాశం కలిగింది; లోభిని, జ్ఞాతి ద్రోహ కరుణ్ణి తానే రాజును చేసాడు; కృష్ణుడు, భీష్మద్రోణులు చెప్పిన మాటలను పెడచెవిని పెట్టే నన్నాడు ధృతరాష్ట్రుడు. అయినా సుతులు వీరమరణాన్ని పొందడానికి తాను విచారించడం లేదన్నాడు. ఆమీద ధర్మరాజు వల్ల తనకేమీ కొరతలేకుండా సుఖాన్నే పొంది ఉన్నానన్నాడు. అయినా తనకొక కోర్కె ఉన్నది – అని ధృతరాష్ట్రుడు ఎంతో సంస్కారాన్ని వెలార్చె మాట అన్నాడు.

“ రాజ్యంలో ఎవరు ఎట్టి పని చేయదలచినా, రాజు అనుమతిని తీసికోవాలి. ఎల్లరకు రాజే గురువు. నీవో రాజోత్తముడవు ! అంచేత నీ అనుజ్ఞను కోరవలసి వస్తోందయ్యా !

రాజ వంశజునకు సమరంలో మరణాన్ని పొంద డమే ఉత్తమం; లేకపోతే తపస్సు చేస్తూ తనువును చాలించాలి. అందుచేత నేనూ, గాంధారీ అడవులలో మునుల సన్నిధానంలో తపోవృత్తిని అవలంబించి, కంద మూల ఫలాలను తింటూ, నిన్ను దీవిస్తూంటాము. మాకు వనవాసానికి అనుమతించు ” అన్నాడు.

ధర్మరాజుకు మిగిలిఉన్న పెద్దదిక్కు ధృతరాష్ట్రుడే. ఈయనకూడా అడవికి పోతున్నానంటే, అతనికి వెనుక పట్టిన దుఃఖం మళ్ళీ పొడసూపింది.

" గూఢ బుద్ధివై నమ్మించి-కురువరేణ్య
యే నెఱుంగక యుండంగ- నిట్లు శోక
వనధిఁ దేలుచు నుండి తి-వ్వనట గంటి
నింక రాజ్యంబు నాకెట్టు-లించుఁ జెపుమ ? "

-ఆశ్ర : 1-31.

" నీవు రాజవు గాక, నీకేను రాజనే ? గురుని, మహ రాజును, కరువరేణ్యుని ఇలా చేయమని చెప్పడానికి నేనా రాజును ? దుర్యోధనాదుల దుష్కార్యములు నా మనసున శోధించినా కనబడవే ! విధి మోహమున నైన విరస భావం వల్ల జరిగిందానికి వగచి ప్రయోజనంలేదు. ఇదిగో ఈ రాజ్యాన్ని నీకు బొరసుడు, యీ యుయుత్సునికి వప్ప చెప్పి, నేనూ నీతో అడవికి వస్తా " నన్నాడు ధర్మరాజు.

ధృతరాష్ట్రుడు " అలా కాదు. నేను పెద్దవాడినై పోయాను. నీవు ఎంతో కాలంనుంచి నాకు శుశ్రూష చేశావు. ఇంక నన్ను తపస్సు చేసుకోనీయవయ్యా! " అని, విదుర కృప సంజయులతో తనకు శోష వస్తోందనీ, ధర్మరాజుకు నచ్చచెప్పమనీ, అంటూ మూర్ఛిల్లాడు.

' కరి దశ సహస్ర బల విస్ఫురితు ' డయిన ధృత రాష్ట్రుడు ఇలా మూర్ఛిల్లి, గాంధారి నాశ్రయించడం ధర్మరాజునకు ఆశ్చర్యాన్ని కల్గించింది.

" మీ తండ్రి యతుల తపంబు తోడి సంతత చింతఁ గూడు దొడంగి తా నుండుట " చేత ఇలా అయాడని గాంధారి చెప్పగానే,

" అయ్యయో ! ఎవరి వల్ల ఈ మహాత్మునికీ కష్ట స్థితి కల్గింది ? " అని అతని మొగమున శీతజలమును విదిల్చి, ఆతనికి తెలివి వచ్చేటట్లు చేసాడు.

ఈలోగా స్త్రీజనం అంతా గొల్లుమని ఎలుగెత్తి ఏడ్చారు.

అదిగో అప్పుడు వ్యాసుడు ప్రత్యక్షమయాడు. అంబికేయుడు చెప్పినట్లు చేయమని ధర్మరాజు నాదేశించాడు: కురుకులానికే వ్యాసుడు ధర్మ విధోపదేష్ట, అతడే పర దైవము; ఆతని మాటను కాదనడానికి ఎవరికీ సాహసం లేదు. అంచేత రాజులకు దృఢ సమాధిని తనువు చాలించడం విధి అని వ్యాసుడు అనగానే, ధర్మరాజు !

" అనఘా ! యిక్కురు ముఖ్యున
కనుజ్ఞ యే నిచ్చితిని, మ-హాత్తర మగు మీ
యను మతియుఁ బడసెఁ, జనుఁ గా
క నిజేచ్ఛను, నాకు విఘ్న-కరణము దగునే ?"

-ఆశ్ర : 1-60

అని అన్నాడు.

ఇదీ వ్యాసుని మూర్తిమత్వం అంటే ! అతని పలుకే ఆదేశం, అదే ఉపదేశం ! " గతకాలము మేలు వచ్చుకాలము కంటెన్ " అని ఒకప్పుడు తల్లిని, అంబిక, అంబాలికలను తపోవనానికి పంపాడు. మళ్ళీ ఇప్పుడు అంబికేయుణ్ణి తపోవనానికి పంపమని అజాత శత్రువును ఆదేశించి, ఒక సమస్యకు ధర్మబద్ధమైన పరిష్కారాన్ని సూచించాడు, పరాశరుడు. ★

## నేను !

చీకటిలో
దీపశిఖనై
ప్రజ్వలిస్తాను !
కాలవాహినిలో
కొత్త అలనై
చెలరేగుతాను !
రాజీవపు
రేకునై
విచ్చుకుంటాను !
వర్ధమాన
రేపునై
పరుగులు తీస్తాను !

— ఆచార్య భావన్

# ఉసిరిక

ఎస్. ఎన్. దుర్గారావు

ఇదియొక పెద్ద వృక్షము. దీని నెరుగనివారు సాధారణంగా ఎవరూ ఉండరు; ఇది తోటల్లోనూ, పెరట్లోను పెరుగును.

దీనికి " అమలక " అనే సంస్కృత నామ ధేయము కలదు.

ఇదియొక కల్పవృక్షము వంటిది. దీని గాలి తగిలినను ఈ చెట్టుక్రింద భుజించినను ఆయురారోగ్యములు చేకూరును. అందుకే కాబోలు వనభోజనం పేరిట సంవత్సరానికోసారి ఈ వృక్షము క్రింద భు జిం చ మ ని చెబుతారు.

## వైద్యవాణి

ఉసిరిక మ్రానుచెక్క వగరుగా నుండును. ఇది నీళ్ళ విరేచనము కట్టును, ఈ చెక్క కషాయంతో కురుపులు కడిగిన మానును. ఉసిరిక పండ్లకు ఆరు రుచులలో ఉప్పురుచి తప్ప మిగిలిన ఐదు రుచులు దీనికి కలవు. చైత్రమాసములో పండిన పండ్లకు ఎక్కువ ప్రాశస్త్యము కలదు. దీని రసము త్రిదోషములను హరించును. ఇది రసాయన పదార్థమగుటచే భోజనం మొదట, మధ్యయందును, అంతమందును ఉసిరికపండ్లు ఉపయోగించినచో సర్వదోషములు నివారణయగును దీని గింజలకు కూడ పండ్ల గుణమే కలదు. క్షయవ్యాధి పీడితుడైన చ్యవన మహర్షి దీనిని లేహ్యముగా చేసుకుని, సేవించి క్షయ విముక్తుడైనాడట. అంతేకాక నిత్యయవ్వనుడై చిర కాలము జీవించెను ఈ మహర్షి పేరిటనే ప్రస్తుతము ' చ్యవన ప్రాశ లేహ్యము ' ను తయారుచేయుచున్నారు. పండ్లు దొరకని కాలములో ఉసిరిక పప్పుతో కూడా ఈ లేహ్యమును తయారుచేయుదురు. మరియు అమృతామలక, భృంగామలక తైలములను కూడా ఈ ఉసిరిక పండ్లతో తయారు చేయుచున్నారు. వీటిని శిరస్సునకు మర్దన చేసిన కండ్లకు చలువచేసి శిరో రోగములు ఉపశమించును.

దాదాపు దీని ప్రతి అంగము వైద్యమునకు వాడబడుచున్నది.

ఉసిరిక చూర్ణమును పాలతోకాచి కొంచెము నెయ్యి చేర్చి పుచ్చుకొనిన దగ్గులు తగ్గును; ఉసిరిక పండ్ల రసములో పంచదార కలిపి సేవించిన పైత్యశూలలు శమించును; ఉసిరిక కాయలు ( పండ్లు ) మెత్తగా నూరి పొత్తి కడుపునకు పట్టువేసిన మూత్రము జారీయగును. ఉసిరిక రసంలో మంచిగంధము, తేనె కలిపి సేవించిన వాంతులు తగ్గును, తల త్రిప్పుట మున్నగు వికారములు తగ్గును తెల్లకుసుమల నివారణకు ఉసిరిక గింజలు నీటితో నూరి పంచదార, తేనెతోను కలిపి సేవించవలెను. రాచ ఉసిరికను తినిన మేహరోగములు హరించును. ఉసిరిక పండ్లను మామూలుగా సేవించిన మూత్రదోషములు నివారణ యగును మరియు వీర్యవృద్ధి కలుగును. ఉసిరిక పండ్లను తిప్పసత్తును మజ్జిగలో కలిపి నిత్యమూ త్రాగిన మూలవ్యాధి నివారణ యగును. ఉసిరిక పప్పును నీటితో గాని, పన్నీరులో గాని నూరి కణతలకు పట్టువేసిన తల నొప్పులు తగ్గును. పండ్లను నేతితో వేయించి మెత్తగా నూరి శిరస్సుకు పట్టువేసిన ముక్కునుండి అమితముగా స్రవించు రక్తము కట్టుననుటలో సంశయములేదు. ఉసిరిక పండ్ల రసం, చెరుకురసము, తేనె కలిపిత్రాగిన రక్త మూత్ర కృచ్ఛములు తగ్గును. ఉసిరికపండ్ల రసము నేతితో కలిపి సేవించిన విషమ జ్వరములు హరించును; ఉసిరిక పండ్ల రసములో పంచదార కలిపి త్రాగిన యోనిలో మంట తగ్గును. ఉసిరిక చెక్క రసములో కొంచెము కవిరి చూర్ణమును కలిపి సేవించిన రక్తప్రదరములు కట్టును.

ఉసిరికలో ' రాచయుసిరిక ' అను మరొక రకము కలదు. ఈ ఉసిరిక కాయలు పెద్దసైజులో నుండును. కాయలు గుతులు గుత్తులుగా కాయును. ఉసిరిక కంటే ఇది బహు తీక్ష్ణ గుణముకలది. దీనిని జాగ్రత్తగా వాడకున్న నోరుపట్టెడి గుణము కలది. ★

# ఈ చరిత్ర ఇంతే

పట్టుపాన్పు మీద ఠీవిగా కాలుమీద కాలుంచుకుని, ధవళ వస్త్రాలతో వేయి సూర్యుల కాంతితో ప్రకాశించు ముఖారవిందంతో తలపైన అందమైన కిరీటంతో ఒక చేతిలో హారంతో ఇంకో చేతిలో పుస్తకాలతో చిరునవ్వును చిందించే మోముతో, ఈ ప్రపంచాన్ని వీణలో ఇమిడ్చి మానవ హృదయ జీవితగానాన్ని మనోజ్ఞంగా గానం చేస్తూ సరస్వతీదేవి నాకు కనపడింది.

గలగల శబ్దంచేస్తున్న సరోవరంలో దుముకబోయిన నాకు ఆమె ప్రత్యక్షంగా కనిపించడం నాకు ఆశ్చర్యాన్ని ఆనందాన్ని అంతకుమించి నా జన్మ ధన్యమయినట్లుగా భావించాను నేను.

" అమ్మా ! " అంటూ ఆ తల్లిని పిలుస్తూ పరవశుడి నై ఆమెదగ్గరకు పరిగెత్తుకుని వచ్చాను. నా కళ్ళనిండా ఆనందబాష్పాలు జలజల రాలుతున్నాయి.

" నా తప్పు క్షమించమ్మా ! " అంటూ నేను ఇంతకు ముందు ప్రయత్నించిన ఆత్మహత్యకు.... భారతి వీణా నా దానికి అపశ్రుతి కలిగించినందుకు, నేను ఒక్కసారిగా బోర్లాపడి నా శిరస్సు ఆ తల్లి పాదధూళితో పునీతం చేసుకున్నాను.

భారతి తన వీణను ప్రక్కకుపెట్టి నిలుచుంది. కన్న తల్లికన్నా ప్రేమగా మృదుమధురంగా, వెన్నలైన మనస్సుతో ఆప్యాయంగా పిలిచి తనచేతిని శుభాశ్శీశులతో నా తలపైన వుంచి ఆశీర్వదించింది.

నా ఆనందానికీ, నా అదృష్టానికీ పొంగిపోయాను. అమ్మ ఒడిలో హాయిగా పడుకుని అన్నంతిననని మారాం చేస్తున్న నాకు చందమామని చూపిస్తూ గోరుముద్దలు తినిపిస్తున్నట్లు అనిపించింది.

నేను ఈ ప్రపంచంలో ఏదీ సాధించలేనిది లేదనీ, అందరికన్నా నేను చాలా గొప్పవాడిననీ అనుకున్నా నా

ఆమె మెత్తని చేయి నా తలపైన అమృతజల్లుని కురిపించింది.

నా రెండు చేతులూ జోడించి నా శిరసు వంచి నమస్కరించి, ఏదో తన్మయత్వంతో భారతి వీణను కళ్ళకు అద్దుకుని నమస్కరించాను.

ఆమె పాదధూళి తీసుకోడానికి వంగి నా శిరస్సుపై ఘల్లుఘల్లుమని మ్రోగే ఆ మెత్తని పాదాన్ని వేసుకుని నా మానవజన్మను పునీతం చేసుకున్నాను.

ప్రవీ

బల్లమీద చేతులుంచుకుని కుర్చీలో కూర్చుని నిద్రలోకి జారుకున్న నాకు హఠాత్తుగా మెలకువ వచ్చింది.

ఎదురుగా నా ఆరాధ్య దైవమైన సరస్వతీదేవి ఫోటోలో నవ్వుతూ కనిపించింది.

నేను ఊహించింది కలో, నిజమో నాకు అర్థంకాలేదు.

నాలో ఏదో తెలీని ఉత్తేజం ఆవరించింది.

" అమ్మా ! నేను పడుతున్న బాధలు చూడు. ఈ జీవితం అశాశ్వతం. నేను ఈ ప్రపంచంలో చేయవలసిన కర్తవ్యం ఏమిటి ? ఈ జీవితాన్ని ఇంత వ్యధతో కష్టాలతో ఎందుకు సృష్టించావు తల్లీ! ఈ దేశంలో ఎక్కడ చూసినా పేదరికం, దరిద్ర దేవత తాండవిస్తున్నాయి.

ఎన్నెన్నో ఘోరాలు.... రాజకీయ హత్యలు. అవినీతి అడుగడుగునా పేరుకుపోయిన ఈసమాజంలో పేదరికంలో కూరుకుపోయిన మనిషి ఎలా జీవించాలి ?

ఇంత కర్కశ మాయా మర్కటమైన ఈ సమాజాన్ని.... అన్యాయాలకి ఓర్చుకుంటూ అవస్థలు పడుతున్న నాతోటి సోదరులను .... వరకట్నపు బిగి కోరల్లో దాస్య శృంఖాలాలను ఛేదించుకోలేకపోతున్న నాతోటి సోదరిలను....చూస్తూ ఎలాఓర్చుకోను తల్లీ .... ఈ సంఘం మారాలి....ఈ వ్యవస్థను మార్చాలి.... ఉపదేశించు. ”

అంటూ ప్రార్థన చేశాను.

నాకెందుకో చిన్నప్పటినుండి సరస్వతీదేవి ఎడల ఎంతో ప్రేమ, ఆరాధన.

రోజూ ఉదయాన “ సరస్వతీ నమస్తుభ్యం....” “ యా కుందేందు తుషార హార ధవళా.... ” అంటూ శ్లోకాలు మననం చేసుకుంటూ ఆమె పాదాలకు నమస్కరిస్తూ లేస్తాను.

ఏదైనా పని ప్రారంభించేముందు సరస్వతీదేవిని ఓ మారు భక్తితో ధ్యానించి నమస్కరించనిదే ఆపని ప్రారంభించను.

నా జీవితంలో ఎన్నో అడ్డంకులు వచ్చినా వాటిని తీయగా నెట్టేశాను.

చిన్నప్పుడు ఏవో కవితలు వ్రాశేవాడిని. ఆ పునాది నన్ను రచనాశక్తిలోకి దింపింది.

సరస్వతీదేవి నాకు కర్తవ్యతా బోధనచేసి ఈ సమాజంలో నారచనల ద్వారా చైతన్యం తీసుకురావాలని కోరినట్లు నాకనిపించింది.

అప్పటి నుండీ కాగితమూ, కలమూ నాప్రాణం, సాహిత్యానికి చాలా దగ్గరగా అయిపోయాను.

ఎన్నెన్నో కథలువ్రాసి పత్రికలకు పంపాను.

అన్నీ మెల్లి మెల్లిగా తిరిగి రావటం ప్రారంభించాయి.

నాకు నా జీవితంమీదే కసి పెరిగింది. నాలో నిరాశ ఆవరించింది.

“ అమ్మా ! నా జీవితంలో ఈ సమాజంమీద నిరాశా జీవుల్లో నేనూ ఒకడినై మిగిలాను. సమాజంమీద చైతన్యం తేవాలని ఎంతో కృషి చేస్తున్న నాకృషి బూడిదలో పోసిన పన్నీరయింది. ఇంతవరకు ఎన్నెన్నో సమస్యలమీద ప్రజలను చైతన్య వంతులుగా తీర్చిదిద్దే రచనలు చేశాను.

అడవిని కాచిన వెన్నెలయింది నా ప్రతిభ.

ఎందుకలా జరుగుతోంది.... ?

పత్రికలు పేరుపొందిన గొప్పవాళ్ళవే ప్రచురిస్తాయి. అనే భ్రమ మొలిచింది నాలో.

ధనిక వర్గాల విలాసాలు.... కార్లల్లో తిరగటం, రెస్టారెంట్స్‌లో తినడం, ఎ.సి. రూముల్లో విస్కీలు తాగటం గురించి వ్రాస్తే ప్రజలు కథల్లో తమ జీవి

తాలను ఊహించుకుని మురిసిపోయి చదువుతారు.... సామాన్య ప్రజలగోడు ఎవ్వరికీ పట్టదు అనుకున్నాను.

ఎందుకు.... ఎందుకు.... ఎందుకు ? అన్న ప్రశ్న లకి నాకు జవాబులు దొరకలేదు.

వెంటనే నాకో ఆలోచన స్ఫురించింది. ఈ దెబ్బతో నేను ఓ మంచి రచయితని అయిపోవచ్చు.

నా అంత గొప్పతనం సంపాదించిన రచయిత వేరొకడు వుండడు.

నాకు ఈ సమాజంతో పనిలేదు.... నా జీవితం.... నాసంపాదన, నా భార్య నా పిల్లలే నాకు ముఖ్యం. ఎవరిని కోసమో కష్టపడితే నాకేం లాభం? లక్షలరూపాయిలు నా యిల్లు చేరితే చాలు.

క్షుద్రసాహిత్యం.... సెక్స్.

క్షుద్రసాహిత్యం పేరుతో ఎన్నో భయాందోళనలు సృష్టించి వాటిని ప్రజల మధ్యకు తీసుకుని వెళితే ప్రజలు చాలా ఉత్సాహంగా చదువుతారు.

అప్పుడు నాకు డబ్బుకి డబ్బు! పేరుకి పేరు !

సెక్స్ మసాలా గుప్పించి నా రచనలు రాస్తే యువకులు, వృద్ధులనక ప్రతీ మగాడూ చాలా ఇంట రెస్టింగ్‌గా చదువుతాడు.... ఏదో తెలియని ఊహలతో నన్ను ఇంకా రాయండి! అంటూ ప్రోత్సహిస్తారు.... పేజీపేజీకి నగ్నంగావున్న స్త్రీని ఆద్యంతమూ వర్ణిస్తే చాలు నా నవల పదో ముద్రణలో కూడా ఓ కాపీకూడా మిగలకుండా అమ్ముడై పోతుంది.

అందుకే నాపేరు ఇంకోనెలలో ఆంధ్రదేశంలో మారుమ్రోగిపోతోంది- అన్న ఉత్సాహంతో గబగబా కాగితాలూ కలమూ అందుకున్నాను.

వ్రాయబోయేముందు సరస్వతీదేవి కటాక్షం కోసం చూశాను. " కాటుక కంటినీరు చనుకట్టు పైంబడి ఏల ఏడ్చెదో.... " అన్న పోతనామాత్యుని వాక్కు నిజమేనా అన్నట్లు సరస్వతీదేవి కన్నీటి బొట్లు జలజలా రాలు తున్నాయి.

చిరునవ్వుతో మందహాసం చేసే ఆమె ముఖం కళా విహీనమైంది. నాకు నోటమాట రావటంలేదు. ఆమె పెదాలు చిరునవ్వుతో ధ్వనించాయి.

" మీ కర్తవ్యాలని మీరు మరిచిపోతున్నారు.... సాహితి తల్లిని నన్నే శూలాలతో పొడిచేస్తున్నారు. సాహిత్యం పేరుతో నన్ను అవమానిస్తున్నారు,

స్త్రీ ఆదిశక్తి.... స్త్రీని తల్లికిచ్చిన గౌరవంతో పూజించటం మాని కామవాంఛతో మీ అక్కా-చెల్లెళ్ళను నడి బజార్లో దహనం చేసేస్తున్నారు.

అమ్మ- అమ్మంటే నేను.... నేనంటే భారతమాతను.. భారతమాతంటే స్త్రీ.. అడుగడుగునా భారతమాతకూ, స్త్రీకి జరుగుతున్న అత్యాచారాలను అన్యాయాలను ఎదిరించి పోరాడటం మాని విచ్చల విడిగా రాస్తూ డబ్బు కోసం కక్కుర్తి పడుతూ తుచ్ఛమైన ఈ శరీరాన్ని.... జీవితాన్ని సెక్స్‌కే పరిమితం చేస్తూ ప్రవర్తిస్తున్నారు మీరు.

ప్రజలలో భయాందోళనలు కల్గించి చేతబడులు, బాణామతి, కొరివి దెయ్యాల పేరుతో సొమ్ము చేసుకుంటున్నారు.

సాహిత్య లోకంలో.... ప్రయోజనకరమైన సాహితీ వృక్షానికి వేరు పురుగులు మీరు.

ఏ కలంతో మీరు విచ్చల విడిగా రాస్తూ ఉన్నత స్థితికి వచ్చారో.... ఆ కలంలోని పాళీ.... అంతే స్త్రీ లోకమంతా కత్తిబట్టి .... మీ పాలిట మృత్యువై మీ శరీరాన్ని తూట్లు తూట్లుగా పొడిచి నాశనం చేయును గాక ! ఇది నా శాపం.

మిమ్మల్ని అమితంగా ప్రేమించే అభిమానులు సైతం మీపై తిరుగుబాటు చేస్తారు.... ఇది నిజం.. తథాస్తు ! "

వెంటనే నేను చేస్తున్నపనికి నాబుర్ర నేలకేసి బాదుకుని అలాంటి రచనల జోలికి పోనని ప్రతిజ్ఞ చేశాను.

# తొలి తెలుగు విజ్ఞాన సర్వస్వకర్త

# శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు

**తెలుగు** జాతి సాంస్కృతిక వికాసానికి, సామాజిక చైతన్యానికి కృషి చేసి, విజ్ఞాన ప్రబోధం చేసిన మహనీయులలో కీ.శే. కొమర్రాజు లక్ష్మణరావుగారు అగ్రగణ్యులు. నిరంతరపరిశోధనా తత్పరులై, నిష్పాక్షిక మైన దృష్టితో చరిత్ర రచన చేసి, తెలుగులో చారిత్రక గ్రంథ రచనకు పునాది వేశారు. అంతేకాదు సంఘ సంస్కరణాభిలాషియైన అభ్యుదయ కాముకుడు బహు భాషా వేత్త. మహా పండితుడు.


చాగంరెడ్డి నరసింహారెడ్డి


లక్ష్మణరావుగారు క్రీ.శ. 1877వ సంవత్సరం మే నెల, 18 వ తేదీన కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా, పెనుగంచిప్రోలు గ్రామంలో జన్మించారు. తండ్రి వెంకటప్పయ్యగారు. తల్లి గంగమ్మగారు. లక్ష్మణ రావుగారు వెంకటప్పయ్యగారికి రెండవ భార్య సంతానం. లక్ష్మణరావుగారికి ముందే వారికి ఒక ఆడపిల్ల కలిగింది. మొదటి భార్య చనిపోయిన తరువాత వెంకటప్పయ్యగారు గంగమ్మగారిని వివాహం చేసుకొన్నారు. లక్ష్మణరావుగారికి రెండేళ్ళు నిండిన తరువాత తండ్రి మరణించారు. మొదటి భార్య కుమారుడైన శంకరరావుగారప్పటికి యుక్తవయస్కుడవటం చేత కుటుంబభారం వహించ వలసి వచ్చింది. ఆయన సవతి తల్లినీ, తమ్ముడినీ చెల్లినీ భోనగిరికి తీసుకొని వచ్చాడు. భోనగిరిలో లక్ష్మణ రావుగారు సంస్కృతం, తెలుగు వర్ణమాలను నేర్చు కోవడం జరిగింది.

లక్ష్మణరావుగారి ప్రాథమిక విద్యాభ్యాసం పూర్తి కాగానే తన తల్లి, అక్కగారితో సహా నాగపూర్‌లో వున్న మేనమామ బండారు మాధవరావుగారి వద్ద చేరారు. లక్ష్మణరావుగారు నాగపూర్‌లోని మారిస్ కళాశాలలో బి. ఏ. చదివారు. పట్టభద్రుడయ్యేనాటికి సంస్కృతం, హిందీ భాషలలో కూడా మంచి ప్రావీణ్యం సంపాదించారు. ఆయన మహారాష్ట్ర పత్రికలైన 'సమాచార్', 'వివిధ విజ్ఞాన విస్తార్' అనే పత్రికలతో సాన్నిహిత్యం ఏర్పరచు కొన్నారు. కేసరి, మహారాష్ట్ర పత్రికలలో వ్యాసాలు వ్రాస్తుండేవారు. ఆనాటి మరాఠీ సాహిత్యరంగంలో వీరు పాల్గొంటూ గొప్పగొప్ప విద్యాంసులతో చర్చలకు దిగేవారు. 1902 వ సంవత్సరంలో ప్రైవేటుగా చదివి కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి ఎం. ఏ. డిగ్రీని సంపాదించారు.

లక్ష్మణరావుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. బహు భాషావేత్త ఆయనకు వంగ భాష, మహారాష్ట్ర, గుజరాతీ, పాలీ, సంస్కృతం ఆంగ్లం, ఆంధ్ర భాషలలో మంచి పాండిత్యం వుంది. ఆయన విద్యార్థి దశ అంతా మహారాష్ట్రలో గడిచినా తెలుగుదేశంలోని సారస్వత, సాంస్కృతిక చైతన్యాన్ని గమనిస్తూనే వున్నారు.

1906 వ సంవత్సరంలో లక్ష్మణరావుగారు గాడిచెర్ల హరిసర్వోత్తమరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, రావిచెట్టు రంగారావుగార్లతో కలసి " విజ్ఞాన చంద్రికా మండలి " ని స్థాపించి, దానికొక స్థిరమైన రూపాన్ని కల్పించారు. మూడు నెలలకొక పుస్తకం ప్రచురించే విధంగా ప్రణాళిక తయారు చేశారు. ఆ విధంగా వారు మండలి తరపున " అబ్రహాంలింకన్ జీవితచరిత్ర, హిందూ మహాయుగం, జీవశాస్త్రం, రాణీ సంయుక్త, మహమ్మదీయ యుగం, పదార్థ విజ్ఞానం శాస్త్రం, రసాయన శాస్త్రం, ఆంధ్రుల చరిత్ర, విమలాదేవి, రాయచూర్ యుద్ధం, విజయనగర సామ్రాజ్యం, పాతాళ భైరవి "

మొదలైన గ్రంథాలు మువ్వయిదాకా ప్రచురించారు. 1912 వ సంవత్సరం నుంచి విజ్ఞాన చంద్రికామండలి ప్రచురించిన వైజ్ఞానిక, చారిత్రక, శాస్త్రీయ గ్రంథాలు పాఠ్యపుస్తకాలుగా నిర్ణయింప బడ్డాయి. ఆ విధంగా సమస్తాంధ్ర దేశాన్ని లక్ష్మణరావుగారు జాగృతం చేశారు.

1915 నుంచి లక్ష్మణరావుగారికి తెలుగులో విజ్ఞాన సర్వస్వం ప్రకటించాలనే కుతూహలం బలంగా నాటుకొంది. ఈ విజ్ఞాన సర్వస్వంకోసం ఆయన చాలా శ్రమ పడవలసి వచ్చింది. 1918 నుంచి ఆయన జీవితం సర్వస్వం విజ్ఞాన సర్వస్వంలో వ్యాసాలు వ్రాయడానికే వెచ్చించారు. ఈ విషయంలో ఆయనకు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు సహాయపడ్డారు. కానీ దురదృష్ట వశాత్తు మూడు సంపుటాలు కూడా పూర్తి కాకుండానే పరిసమాప్తం కావలసివచ్చింది. ‘ ఆంధ్ర ’ అనే విషయ విభాగం క్రిందే ఒక సంపుటాన్ని వెలువరించడానికి ప్రణాళిక సిద్ధం చేశారు.

సంఘ సంస్కరణ విషయకంగా లక్ష్మణరావుగారు వీరేశలింగంగారికి అనుచరులు. ఆయనకు సంకుచిత దృక్పథాలు లేవు. పురుషులతోబాటు స్త్రీలు కూడా సమాన హక్కులు పొందాలని, స్త్రీల సంస్కారం, మనోవికాసం కోసం కృషి చేయాలనీ చెప్పేవారు. ఋగ్వేదకాలంలో కులవ్యవస్థ వుండేది కాదని, వర్ణ వ్యవస్థ మాత్రమే వుండేదని, బాల్య వివాహాలు కూడా వుండేవి కావని ఆయన అభిప్రాయం. కులవ్యవస్థను వ్యతిరేకించడం, వితంతు వివాహాలను ప్రోత్సహించడం వలన ఆయన తన తల్లికి కూడా దూరమయ్యారు.

తెలుగులో ఆనాటికి ప్రామాణికమైన చారిత్రక గ్రంథాలు లేకపోవడం జూచి లక్ష్మణరావుగారు ఉత్తమ ప్రమాణాలతో ‘ హిందూ మహాయుగం మహమ్మదీయ యుగం ’ మొదలైన చరిత్ర గ్రంథ రచన చేసి తరువాత వారికి మార్గదర్శకులయ్యారు.

“ దేశ చరిత్రయనగా రాజుల జీవితములు మాత్రము గాదు. అప్పటి జనుల స్థితి గతులును, విద్యావిభవములు గనుగొనుటయు నావశ్యకము ” అంటారు వీరు. వీరిని గురించి నేలటూరి వెంకట రమణయ్యగారు “ ఆంధ్ర దేశమునందు ప్రఖ్యాతినందిన చరిత్రకారులలో కొమఱ్ఱాజు వెంకట లక్ష్మణరావుగారు అగ్రగణ్యులు. ఇరువదవ శతాబ్దపు ప్రారంభదశయందు తన రచనలచే జాతీయోద్బోధము కలిగించిన మహనీయులలో నొక్కరు ” అని అన్నారు.

లక్ష్మణరావుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి. బహుభాషా వేత్త. హేతువాద పురస్సరంగా, ఆధునిక దృక్పథంతో సాహిత్య కృషికి పూనుకొన్న మహవ్యక్తి. విజ్ఞానశాస్త్రం, చరిత్ర, రాజకీయాలు, సాంఘికశాస్త్రం, లలితకళలు, సాహిత్యం, వేదాంతం, పరిశోధన మొదలైన వాటిలో మునిగితేలిన ప్రజ్ఞావంతుడు. తన జీవితమంతా నిర్విరామంగా గ్రంథరచనకే కృషి చేసిన లక్ష్మణరావుగారు మద్రాసులోని ఎగ్మూరులో వున్న వేద విలాస భవనంలో జూలై 13, 1923 వ సంవత్సరం స్వర్గస్థులయ్యారు. అప్పుడు రాజమహేంద్రవరంలో జరిగిన సంతాప సభలో చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు—

“ గుణవంతుడు మనస్వి దీక్షితుఁడు ప్రాజ్ఞుల్ జ్ఞప్తి యందెప్పుడున్
గణుతింపన్ గురియైన మానవుడు ప్రాక్చారిత్ర వైజ్ఞానికా
గ్రణి స్వార్థంబు త్యజించి లోకమునకై కష్టించి నట్టిండు ల
క్ష్మణ రావేబది నిండకుండ మునుపే కాయమ్ము వీడెన్ గటా ”

అని తమ సంతాపాన్ని ప్రకటించారు. ఇంతటి మహావ్యక్తి ఆంధ్రులకు చిరస్మరణీయుడు.

తృప్తిపడి చూశారా దంపతులు.

" అవును సర్ ! బాబు నా కొడుకు కాదు ! అసలు నాకు పెళ్ళే కాలేదు ! "

" ఏమిటీ ?... ఇది... నిజమా ? మరి బాబు...? " ...ఆశ్చర్యంగా అన్నాడు శాంతారామ్.

" సారధి కొడుకు ! "




ఈసారి మరింత తెల్లబోయారు శాంతారామ్, భార్య, పక్క గదిలోంచి అతి శ్రద్ధగా వింటున్న చందన కూడా.

" కాస్త అర్థం అయ్యేలా చెప్పు జయంత్. బాబు సారధి కొడుకేమిటి ? .... సారధి తన కొడుకునే ఎత్తుకొచ్చి నాటకం ఆడాడా ? " ఆదుర్దాగా అడిగాడు శాంతారామ్.

" లేదు ! సారధికి బాబు తన కొడుకని తెలియదు ! "

" మరి ? "

" అదంతా ఓ పెద్ద కథ ! ....ఓ సారి మళ్ళీ చుట్టూ" చూసి బాబు లేడనుకున్న తరువాత మొదలు పెట్టాడు జయంత్.

"నేనూ, మా అక్కా, బావా, అక్క కూతురు సంధ్యా ఓ పెళ్ళికెళుతుండగా మా టాక్సీని ఓ లారీ గుద్దేసింది. అక్కా బావా అక్కడికక్కడే చచ్చిపోయారు. సంధ్య నేనూ స్వల్ప గాయాలతో బతికి బైటపడ్డాం.

మగాణ్ణి నేను కోలుకున్నాను. కానీ సంధ్యమాత్రం కృంగిపోయింది. దానికి తల్లి, తండ్రి అన్నీ నేనే అయి ఓదార్చాను.

అయితే ఆమె కోలుకోలేదు. తనలో తానే కుమిలిపోతూ .... కృశించి పోతోంది. నేను ఆమె గురించి దిగులు పడుతూండగానే మరో చేదు నిజం బైటపడింది.

సంధ్య గర్భవతి !

పెళ్ళికాని సంధ్యకి నెల తప్పింది.

నేను కూలబడి పోయాను. కళ్ళు బైర్లు కమ్మాయి. అలాగే లేచి బుజ్జగించి అడిగాను. అప్పుడు సంధ్య –

" తనూ సారధీ ప్రేమించుకున్నామనీ, త్వరలో అమ్మకి చెప్పాలనుకుంటుండగానే అతను తొందర పడ్డాడని తత్ఫలితంగా నెల తప్పిందనీ " గోడుగోడున ఏడుస్తూ చెప్పింది. ఒకటి రెండు సార్లు ఆత్మహత్య చేసుకోవాలని కూడా ప్రయత్నించింది. నేను దానికి ధైర్యం చెప్పి సారధి అడ్రస్ అడిగి అతని దగ్గరకు వెళ్ళి సంగతి వివరించాను.

అతను వికటంగా నవ్వి తనకేం సంబంధం లేదు పొమ్మన్నాడు. ఎంతో బతిమాలాను. ఫలితం లేకపోయింది. నీరసంగా తిరిగొచ్చేశాను.

విషయం విన్న సంధ్య మరింత కృంగిపోయింది. తనే వెళ్ళి బతిమాలింది. కానీ ఫలితం శూన్యం !

చివరికి ఆమెని నేనే పెళ్ళి చేసుకుంటానన్నాను. సంఘంనించి ఆమెని కాపాడడానికి నాకు మరో మార్గం కనిపించలేదు. అయితే సంధ్య మాత్రం అంగీకరించలేదు.

అయితే లోకానికి నేనేదో చెప్పుకుంటాను ! దానికి మాత్రం నువ్వు మాట్లాడద్దు ! అని దాన్ని తీసుకుని ఓ కొత్తవూరెళ్ళిపోయాను. అక్కడ సంధ్యకి బాబు పుట్టాడు. బాబుని చూస్తేనైనా అతని మనసు మారుతుందేమో అన్న ఆశతో మళ్ళీ వెళ్ళి సారథికి చెప్పాను.

"ఎలాగూ నీ కొడుగ్గానే పెరగబోతున్నాడుగా అలాగే పెరగనీ !" హాస్పటల్‌లో తండ్రిగా నా పేరిచ్చానని తెలిసిన సారథి వ్యంగ్యంగా అన్నాడు.

తరవాత కూడా ఎన్నో చెప్పాను. అతను విన్లేదు !

అంతే ! ఇంక సారథి విషయం పూర్తిగా వదిలేశాను. బాబు నా కొడుగ్గానే పెరుగుతున్నాడు. మా నోటితో మేం ఏనాడూ భార్యాభర్తలమని చెప్పకపోయినా అందరి దృష్టిలోనూ మేము భార్యాభర్తలమే !

అయితే దేవుడికి సంధ్యమీద ఇంకా కసిగా వున్నట్టుంది. ఒక్కరోజు సుస్తీతోనే తన దగ్గరికి తీసికెళ్ళిపోయాడు. అప్పుడు బాబుకి మూడేళ్ళు. సారధి దగ్గరికి అప్పుడు కూడా వెళ్ళి విషయం చెప్పి రమ్మన్నాను. ఆ కఠినాత్ముడు కరగలేదు.

బాబు, తల్లిమీద బెంగపెట్టుకున్నాడు. తిండి తిప్పలు మానేసి చిక్కి శల్యమైపోయాడు. సంధ్యతో పాటు వాడూ దూరమౌతాడన్న భయం కలిగింది. అందుకే డాక్టర్ సలహాతో మరో .... వూరు అంటే నేను మొన్నటిదాకా వున్న వూరొచ్చి స్థిరపడిపోయాను.

బాబు తల్లి పోయిందన్నాను.

"పాపం !" అన్నారంతా.

అయితే బాబుకి మాత్రం అమ్మ ఎక్కడికో వెళ్ళిందనీ, మళ్ళీ తప్పకుండా వస్తుందనీ చెప్పి నమ్మించాను.

జ గి రి న క థ

రాఘవ, సారధి పోయి పదిహేను రోజులయింది. ఊరు విడిచిపెట్టి చాలాకాలం అయినందున తను వెళ్తానన్నాడు జయంత్ బాబుతో సహా. అక్కడ చేసే ఉద్యోగం ఇక్కడే ఇస్తానన్నారు శాంతారాంగారు. బాబు, దేవకి, చందనలు కూడా దాన్ని బలపరిచారు. అతి బలవంతం మీద గెస్టుహౌస్‌లో ఉండటానికి ఒప్పుకున్నాడు జయంత్. ఏవో ఆఫీసు ఫైళ్ళు చూసుకుంటున్న జయంత్ రెండు కళ్ళు మూసింది చందన. 'ఏమిటీ చొరవ' అన్నాడు జయంత్ ఆశ్చర్యకరంగా ! 'ఇది నటన కాదు, పిచ్చి కాదు, నన్ను నమ్మవు. ఐ లవ్ యు' అంది చందన అతి కష్టం మీద నవ్విస్తూ. సంగతి తెల్సిన శాంతారామ్‌గారు, రెండవ పెళ్ళి వాడితో తన కూతురు సుఖపడుతుందా ! అన్న అనుమానం ఇన్ డైరక్ట్‌గా వెలిబుచ్చారాయన. 'మీకా భయం వద్దు చందన నాకు ప్రాణం కన్నా ఎక్కువ. అయినా ఒక చిన్నమాట. 'బాబు నా కొడుకు కాడు' అన్నాడు జయంత్. నిర్ఘాంతపోయారు శాంతారామ్‌గారు.

( ఇక చదవండి )

బాబు ప్రతిరోజూ అమ్మ గురించి అడగడం నేను వస్తుందని చెప్పడం మామూలైపోయింది. ఆ మాట ఏళ్ళు గడిచినా అడగడం మానలేదు వాడు.

తల్లి రూపం గుర్తులేకపోయినా తల్లి ఆప్యాయత, ప్రేమల కోసం తపించిపోయేవాడు. డాక్టర్ సలహాతో

సంధ్య ఫోటోలు ఏవీ అందుబాట్లో వుంచని కారణంగా బాబుకి తల్లి రూపు తెలియదు! అలాంటి సమయంలో సారధి చిత్రంగా డబ్బు కోసం తన కొడుకునే పావుగా వాడుకొన్నాడు.

అయితే క్రమేపీ అతనిలో మార్పొచ్చింది. ఆ మార్పు నిజమైందే అని చెప్పటానికి అతని చివరి ఘడియలే నిదర్శనం!

కొడుకుక్కోసం అతని ప్రాణం కొట్టుకుపోయింది. చివరికా కొడుకుక్కోసమే ప్రాణాలు కోల్పోయాడు.'' కళ్ళు తుడుచుకుంటూ ముగించాడు జయంత్. అందరి హృదయాలూ భారంగా అయిపోయాయి.

"ఇంక మీకేం అనుమానం లేదుగా?" అన్నాడు జయంత్.

"అయామ్ సారీ జయంత్" మెల్లగా అన్నాడు శాంతారామ్. జయంత్ మాట్లాడలేదు.

"ఇంక లగ్నాలు పెట్టించేయవచ్చా?" వాతావరణం తేలిక చెయ్యడానికన్నట్టు నవ్వుతూ అంది దేవకి.

"అలాగే! పెళ్ళి ఏర్పాట్లు చేయిస్తాను!" ఉత్సాహంగా అన్నాడు శాంతారామ్.

"ఎవరికి తాతయ్యా పెళ్ళి" తోటలో ఎక్కడో ఆడుకుంటున్న బాబు వచ్చాడు.

"నీకు మాత్రం కాదు!" అంది చందన వచ్చి వాడిని పట్టుకుని.

"ఛ! నాకు పెళ్ళేంటి?" సిగ్గుపడ్డాడు బాబు.

అంతా పకపక లాడారు.

"పెళ్ళి మీ అమ్మకి, నాన్నకి!" అంది దేవకి నవ్వుతూ.

"నేను పుట్టినప్పుడే అయిందట కదా! మళ్ళీ పెళ్ళేంటి?" ఆరిందాలా అన్నాడు బాబు.

"పుట్టినప్పుడు కాదు; పుట్టకముందే!" సరిచేసింది చందన.

"పోనీ ఏదో ఒకటిలే! ఇంతకీ పెళ్ళెప్పుడు?"

"లగ్నాలు పెట్టుకున్నాక!" నవ్వింది దేవకి.

"అమ్మాయిగారికి....పదిమంది సంతానం కలగాలి!" పనిమనిషి మురిపెంగా అంది పెళ్ళి మాటలు విని.

"ఎంత మందున్నా వీడే నా మనవడు!" బాబుని ఒళ్ళోకి లాక్కుంటూ అన్నాడు శాంతారామ్.

"కాదు తాతయ్యా!" గంభీరంగా అన్నాడు బాబు. బిత్తరపోయారంతా.

"ఏమిట్రా?" కంగారుగా అన్నాడు శాంతారామ్.

"రేపు నాకు తమ్ముళ్ళు పుడితే వాళ్ళు మాత్రం నీకు మనవలు కాదా?" నిలదీశాడు బాబు.

"నిజమేరా! పొరపాటు! అయితే మొదటి మనవడివి నువ్వు! సరేనా?"

" అలా అన్నావు బావుంది! అమ్మా తొందరగా నాకో తమ్ముణ్ణియ్యి! ఆడుకోవాలి!" సీరియస్‌గా అన్నాడు బాబు.

మరోసారి పకపకలాడారంతా.

జయంత్ చందనకేసి ఓరగా చూశాడు. ఆమె చెంపలు కందిపోయాయి.

* * *

అసురసంధ్య వేళ!

శాంతారామ్ బాబుని తీసుకుని తోటలో కెళ్ళి కథలు, కబుర్లు ప్రారంభించాడు. దేవకి ఆలయాని కెళ్ళింది.

అప్పటికి సరిగ్గా వారం వుంది జయంత్, చందనల పెళ్ళి.

చందన తన గదిలో కూర్చుని ఫోటో ఫ్రేమ్‌లోవున్న జయంత్ ఫోటోని తదేకంగా చూస్తోంది. అప్పుడే మెల్లగా చప్పుడు కాకుండా వచ్చిన జయంత్ ఆమె భుజం మీద తలవాల్చి –

" చందనా! " అన్నాడు గుసగుసగా.

తృళ్ళిపడ్డ చందన, అపై సిగ్గుపడిపోయి –

" ఊఁ! " అంది తలవాల్చి.

" ఒక్కసారి ఇలా చూడు! " ఆమె తల ఎత్తుతూ అన్నాడు జయంత్.

" ఉఁహుఁ! " ఎన్నడూ లేని సిగ్గు మరింత మొగ్గలు తొడిగింది.

" ఏం? ".

" పీటల మీద బ్రాహ్మలు పట్టుకున్న తెర తొలగించి వాళ్ళు చూడమన్నప్పుడు చూడాలి! " చిలిపిగా అంది చందన.

" ఓ! అయితే ఇంతకుముందు మనం అపరిచితుల మన్నమాట! " గాంభీర్యం నటించాడు జయంత్.

" అవును! ఆ తెర తొలిగించందే కనీసం దొంగ చూపులు కూడా చూడకూడదు! ".



" ఐతే, ఇదో! ఇదొకరకమైన యవనిక! అంటే కొత్తరకం తెర! ఆఁ ఇప్పుడు చూడు! " ఆమెకీ తనకీ మధ్య అరచేతిని అడ్డుగాపెట్టి అన్నాడు జయంత్.

పక్కున నవ్వింది చందన.

ఆ నవ్వుల్లో ముత్యాలు ఏరుకున్నాడతను.

ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు జయంత్.

" ఉఁహుఁ! " లాక్కుంది చందన.

" ఏం? తెరలన్నీ తొలగిపోయాయిగా ఇంకేవిఁటి అభ్యంతరం? " అలిగాడతను.

" నేను మిమ్మల్ని పెళ్లి చేసుకోను! "

" అదేవిఁటి? " తుళ్ళిపడ్డాడతను.

" ఈ రెండోపెళ్ళివాణ్ణి చేసుకోవాల్సినంత కర్మ నాకేవిఁటి? " అదోలా మూతి తిప్పింది చందన.

" అయితే మరి నేనేనా తక్కువతిన్నది .... ఈ పిచ్చిదాన్ని కట్టుకోవడానికి? " చటుక్కున లేచాడు జయంత్ కోపం నటిస్తూ.

" అయితే వెళ్ళండి! "

" నిజంగా వెళ్ళిపోతున్నా! " బెదిరించాడతను.

"ఓ ! కే ! "

"వెళ్తే మళ్ళీ రాను .... "

"అసలంటూ వెళ్ళాలిగా ! " నవ్వింది చందన.

"ఏమిటంత నమ్మకం ! "

"నాకు తెలుసు ! "

"ఏమిటి నీకు తెలిసింది ? "

"నన్ను వదలి నీవు పోలేవులే ! " కూనిరాగం తీసింది చందన.

"ఇదిగో అమ్మాయ్ ! నిజంగానే పోతున్నా ! ఎంచక్కా ఇంకో అమ్మాయిని ప్రేమించేస్తా ! ....

"మరి ఈ కొడుకో ? "

"వాణ్ణి తీసుకపోతాను ! "

"అయితే ఇంకేం వెళ్ళండి. మీదే ఆలస్యం ! "

"అవును! నాదే ఆలస్యం! ఆలస్యానికి క్షంతవ్యుణ్ణి! " గభాల్న ఆమెని కౌగిల్లోకి తీసుకున్నాడు జయంత్. ఆమె చెంపలు కందిపోయాయి.

"ఛ ! వదలండి ! " అంది.

"ఉహుం ! వదలను ! జీవితాంతం ఇలాగే నీ కౌగిల్లో నేనూ, నా కౌగిల్లో నువ్వూ .... "

"అయ్యో పిచ్చిపట్టిందని విశాఖపట్నం పంపుతారు!" భయం నటించింది చందన.

"పిచ్చి పడితే విశాఖపట్నం కాదు తీసికెళ్ళేది ! .... కాశ్మీర్ ! .... " సవరించాడతను.

"అబ్బ ! ఆశ ! "

"ఊఁ ఆశే మరి ! ఎంచక్కా మొన్నటిలా ఆ గదిలో .... ఈసారి ఒంటరిగా నీ ఏకాంతంలో, వెచ్చని నీ కౌగిలిలో ఒదిగి, నీ అధరామృతాన్ని గ్రోలుతూ " తన్మయత్వంగా ఆమె పెదవిమీద తియ్యని ముద్ర వేశాడు

చందన కన్నె హృదయం పొంగిపోయింది. ఆమె కన్నె ఎదలో కోటివీణియలు మోగినట్టయ్యాయి.

"జయంత్ ! " అంది అతని చెవిలో గుసగుసగా.

"ఊఁ ! " అతని ఊపిరి ఆమె మెడకి వెచ్చగా తగుల్తోంది.

"అయ్ లవ్ యు ! అయ్ లవ్ యు జయంత్ ! "

"అయ్ టూ ! .... డార్లింగ్ " ! ఆమె లేత పెదవుల్ని అతని పెదవులు సున్నితంగా కప్పేశాయి. ఆ ప్రేమికుల్ని కిటికీలోంచి తొంగి చూసిన రేరాజు సిగ్గుపడి .... పక్కకి తొలగాడు.

-: సమాప్తం :-

# స్త్రీ స్వేచ్ఛావాది - చలం

ఆధునికాంధ్ర సాహిత్యంలో సంచలనం సృష్టించి ఆధునికుల్లో అత్యంతాధునికుడిగా పేరుగాంచిన మహా రచయిత చెలం. ఆయన 1894 వ సంవత్సరం మే 19 న మద్రాసులో కపిలేశ్వరాలయం సమీపంలోని ఒక వీధిలో జన్మించారు. ( ఈయన జన్మదినం విషయం వివాదాస్పదం గానే ఇప్పటికీ వుంది. కాని, పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి ' అరుణాచలంలో చలం ' లో 19 వ తేదీ నిజమైనదిగా తేల్చి చెప్పారు. ) ఈయన పేరు గుడిపాటి వెంకట చలం అయినా " చెలం " గా పాఠకుల హృదయాల్లో సుస్థిరస్థానం ఏర్పాటు చేసుకొన్నారు.

చెలం స్త్రీ స్వేచ్ఛను కోరుతూ సాహిత్యం ద్వారా సాంసారిక విప్లవం ప్రారంభించాడు. అప్పటి వరకు కవులు కేవలం అంగాంగ వర్ణనకోసం మాత్రమే ప్రత్యేకింప బడిన " స్త్రీ " చెలం సాహిత్యం ద్వారా రక్తమాంసాలతో జీవకళ పోసుకుని స్వేచ్ఛా గమ్యం వైపు ప్రయాణిస్తూ పురుషాధికార అహంకారాలను చావు దెబ్బ తీసింది. అయితే.... ఆయన కేవలం సెక్స్ రచయిత అనీ.... పచ్చిశృంగారం ప్రవేశపెట్టి యువకులను వుద్రేక పూరితుల్ని చేసి పెడత్రోవ పట్టిస్తున్నాడనీ అనేకులు విమర్శించటమే కాకుండా పెద్దలు వారి పిల్లల్ని ఆ పుస్తకాలు చదువనీకుండా నిరోధించేవారు. అయినప్పటికీ నేడు చౌకబారు సెక్స్ పుస్తకాలు తలగడ క్రింద దాచి చదువుకొంటున్నట్లుగా ( కొందరు ) ఆనాడు యువతరం చెలం పుస్తకాల్ని చదివి వారి అభిప్రాయాలకు పదును పెట్టుకొనే వారు.

తాను నమ్మిన నిజాన్ని ఘాటుగా సూటిగా చెప్పే స్వభావం చెలంది. పురుషునితో పాటు స్త్రీకి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు అవసరం అని ఆయన చేపట్టిన సాహిత్య పోరాటం సంప్రదాయ వాదులకు, ఛాందస ఉన్మాదులకు అవమానంగా తోచింది. దానికి ప్రతిఫలంగా ఆయనకు " కాముకుడు " " సంఘ వినాశకుడు " అనే బిరుదులను అంటగట్టి ఆయన రచనలు చదవటం నేరంగా.... అపరాధంగా పరిగణించారు.

యమ్మెస్సార్.

బ్రహ్మసమాజంలో కూడా యిమడలేని స్వేచ్ఛాప్రియత్వం చెలంది. చెలం వేదాంతి, స్వాప్నికుడు, ఆదర్శోన్ముఖుడైన అనార్కిస్టు, పశ్చిమ భౌతికవాది, ప్రవక్త, సత్యాన్వేషి, ధార్మికవాది. ఈయన రచనలన్నీ ఈతని అంతఃకరణకు ప్రతిబింబాలు. అతనిలో విశృంఖలత్వమూ.... నిశ్చలత్వమూ వున్నాయి. " ఆర్థిక పరమైన కారణాల్ని ఆజలోకి తీసుకోని ఆదర్శవాదము, కాల్పనిక దార్శనికత, సంస్కారాభిలాష, జనన మరణాల మధ్య ఇరుక్కొన్న అస్తిత్వ భావవేదన" ఆయన రచనలలోని ఐతిహ్యాలు. అతని రచనామయ జీవనాన్వేషణ ఒక గొప్పప్రశ్నార్థకం ? !

ఏ బంధనాలూ లేని అతని స్వచ్ఛమైన స్వేచ్ఛ దైవ ప్రేమను దర్శించిన చెలంలో కేవలం శృంగారాన్నే చూచింది లోకం. ప్రేమలో గల గొప్పత్యాగాన్నీ.... కరుణనీ.... కలగలిపి దర్శించాడు.... దర్శింపచేశాడు చెలం. స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలకు, శరీర హృదయాలకుండే సహజ స్పందనలను నిరూపించి మనసుని వికసింప చేశాడు చెలం. ఈ ప్రయత్నంలోనే ఆత్మోన్నతిని పొందాడు మౌనంలో !

ఇంతటి సంచలనాన్ని సృష్టించిన చెలం సాహిత్యం ద్వారానే కాకుండా రమణాశ్రమంలో చేరి మరింత సంచలనం సృష్టించాడు. ఈయన కవితా హృదయం

## ఎన్నాళ్ళీ బ్రతుకులు

పగలంతా ఎద్దుల్లా
గానుగెద్దుల్లా
కష్టం చేసే
వచ్చేది ఏమిటి ? ఎంత ?
పొట్ట గడవడానికా
పొద్దు గడవడానికా
చెప్పండి ! సూటిగా చెప్పండి !
అదుగో ! అటు చూడండి !
పురిటి నొప్పులు
పడుతున్న ఈ ఆకలి సమాజం నుంచి
సూర్యోదయం
కానున్నది తొలి వెలుగురేఖలు పంచి.

— శిరిపురపు జవహర్‌లాల్

తెలుసుకోవటాన్కి "సుధ"లో ఆయన రాసిన ఈ కవిత గొప్ప తార్కాణం.

"యామినీ శిరోజ దీప్త జ్వాలాకుసుమాలు
తేజోతల్పంపై రాలి అదృశ్యమైనాయి.
రవి కిరణాంగుళీ నఖక్షతాలతో
శ్యామలాకాశం కందింది.
అరుణా చలేశ్వర వామ భాగాన
కుంకుమ పూజ జరుగుతోంది.
మేలుకో...
నీ కళ్ళ కడగంటి చూపుకై
ఆసక్తి పడి జ్యోత్స్నపతి
ముకుళితకరుడై నిలచిపోయినాడు
గవాక్షం వద్ద.
తల్ప పార్శ్వానికి చేరిన నీరెండ
నీ నిద్రావ గహిత మానసాన్ని
నూతన దినోత్సవాని కాహ్వానిస్తోంది.
కేతకీ పరిమళాసక్తుడై వొచ్చి
నీ ధమ్మిల్ల తమోమర్మంలో
చిక్కుకొన్న మలయా నిలుడు
విముక్తికై ప్రాధేయపడుతున్నాడు.
కళ్ళుతెరు !"

"మైదానం" "అరుణ" "స్త్రీ" "మ్యూజింగ్స్" "సత్యం-శివం-సుందరం" మొదలైన ఎన్నో అసంఖ్యాక రచనలు చెలం వ్రాయటమే కాకుండా "కాన్క" వంటి అనువాదాలూ చేశారు. రమణాశ్రమంలో వుండగా వ్రాసిన రచనలు పూర్వపు వాడి, వేడి తగ్గాయని కొందరి అభిప్రాయము. "భగవాన్ పాదాల ముందు దివాన్" వంటి రచనలు ఆయన ఆశ్రమంలో రచించినవే! ఇంతా.... చెలం మహా ప్రస్థానానికి ప్రశంశా పత్రం వ్రాశారు. ఇది బహుళ ప్రాచుర్యం పొందటమే కాకుండా సాహితీ జగత్తులోని పీఠికలకే గీటురాయిగా నిల్చి, ప్రస్తుతం డిగ్రీస్థాయిలో పాఠ్యాంశంగా అర్హత సాధించింది.

మానవుడి బహిరంతర సంబంధాలను గూర్చి పట్టించు కొన్న వారిలో చెలం ప్రముఖుడు. చెలం 84 వ ఏట మరణించాడు. ఆయనభార్య రంగనాయకమ్మ. సౌరిస్ ఆయన కుమార్తె.

చెలం స్వేచ్ఛాజీవి. ఆనాటి సమాజపు కట్టుబాట్లను, ఆచారాలను ధిక్కరించి ఎదురొడ్డి నిలబడ్డాడు. అలానే "స్త్రీలోకాన్ని తిరగబడమనీ.... స్త్రీ బానిసకాదు.... ఆధునికంగా, వైజ్ఞానికంగా అభివృద్ధి సాధించాలని" ఆయన ఆశించి అందుకు శ్రమించాడు. అవిశ్రాంతంగా కృషి చేశాడు. అందుకే "స్త్రీ స్వేచ్ఛా వాదానికి బలం ! గుడిపాటి వెంకటచెలం !!"



# ఉదాత్తతే బలహీనత

ఈ మధ్య ప్రపంచ ప్రఖ్యాతి వహించిన అజంతా ఎల్లోరాలు చూడడానికి వెళ్ళాను. వీటిని సందర్శించే వారు ఔరంగాబాద్‌లో బస చేసుకొని అక్కడినుంచి టూరిస్టు బస్‌లలో వెళ్ళడం పరిపాటి. ఈ యాత్రలో భాగంగా ఔరంగాబాద్, ఖులాదాబాద్, దౌలతాబాద్‌లను చూడడం కూడా జరుగుతుంది. ఔరంగాబాద్‌లో "బీబీకా మక్బరా" అనే తాజ్‌మహల్‌ను పోలిన సమాధి ఉంది. దీనిని ఔరంగజేబ్ తన భార్యకి స్మృతి చిహ్నంగా కట్టించాడు. దౌలతాబాద్ అసలు పేరు "దేవగిరి". తుగ్లక్ తన రాజధానిని ఢిల్లీనుంచి ఇక్కడికే తరలించాడు. ఇక్కడ ప్రసిద్ధి కెక్కిన "చాంద్ మీనార్" అన్న ఎత్తైన ఒంటి గోపురం ఉంది. ఇంక ఖులాదాబాద్‌లో ఔరంగజేబ్ సమాధి ఉంది. ఇంగితజ్ఞానం ఉన్న వారికి విస్మయం, మనోవేదన కలిగే సంఘటన ఇక్కడ జరుగుతుంటుంది. ఈ సమాధి దగ్గర మహమ్మదీయ పూజారి వంటివాడు ఉంటాడు. (నిజానికి ఇస్లాం సంప్రదాయం ప్రకారం దైవప్రార్థన నమాజ్ ఉన్నదే కాని, దైవపూజ, ఆ పూజలను జరిపించే పూజారి వంటివి లేవు). ఈయన సమాధి దగ్గర అగరవత్తులు, గుగ్గిలం వంటి ధూపాలు వేస్తుంటాడు. విశేషమేమిటంటే అక్కడికి వచ్చే యాత్రికులలో ఎక్కువమంది హిందువులు. వీరిలో చాలామంది ఆ సమాధిని చూడగానే దానికి నమస్కారాలు చేయడం, ప్రదక్షిణాలు చేయడం, దానిమీద పూలు జల్లడం, అగరు పుల్లలు వెలిగించడం, దక్షిణలు సమర్పించడం చేస్తుంటారు.

ఔరంగజేబ్ నఖశిఖ పర్యంతం హిందూ మత ద్వేషం కలిగినవాడు. హిందువులను ఇతడు బాధించినంతగా ఇతరులెవ్వరూ బాధించలేదు. అయినా సమాధిని చూడగానే మన వాళ్ళు సర్వం మరచిపోయి దానికి పూజా పునస్కారాలు చేసేస్తున్నారు. బాధాకరమైన విషయమేమిటంటే ఇలా చేసేవారిలో బాగా చదువుకున్నవారు కూడా ఉండడం. చరిత్ర ఎరుగని పాటకజనం ఇలా ప్రవర్తించారంటే అర్థం చేసుకోవచ్చు కాని చదువుకున్నవారు కూడా అదే బాటలో పయనిస్తే ఇంకేమనాలి? హిందువులలోని ఈ మౌఢ్యాన్ని చక్కగా సొమ్ము చేసుకుంటున్నారు అక్కడి ముస్లిం పూజారులు. ఒక చారిత్రిక ప్రాధాన్యంగల ప్రదేశంగా ఆ ప్రాంతాన్ని సందర్శించవచ్చు. అందుకు అభ్యంతరం ఉండాల్సిన అవసరం లేదు. అంతేకాని హిందువులపై దారుణకృత్యాలు చేసిన వ్యక్తికి దైవత్వం అంటగట్టి పూజలు చేయడం క్షమించరాని నేరం.

కె. ఆర్. కె. మోహన్

రాజస్థాన్‌లోని అజ్మీర్ షెరీఫ్, కర్నాటకలోని గుల్బర్గా షెరీఫ్‌లు దేశ ప్రఖ్యాతిగాంచిన ముస్లిం యాత్రాస్థలాలు. ఇక్కడ మహమ్మదీయ యోగుల సమాధులున్నాయి. ఏటేటా వారి వర్థంతులు "ఉర్సులు" ఘనంగా జరుగుతుంటాయి. ఇలాగే ఢిల్లీ దగ్గర ఉన్న హజరత్‌నిజాముద్దీన్ కూడా. వీరందరూ సర్వమత సహనాన్ని పాటించారు కనుక ఈ ఉత్సవాలలో ఎవరు పాల్గొన్నా అభ్యంతరం ఉండకూడదు. నిజానికి వీటిలో ముస్లింలతో సమానంగా హిందూ భక్తులు పాల్గొంటారు. ఇవి సరే హైదరాబాద్‌కి దగ్గర్లో వున్న "జహంగీర్ షేర్ దర్గా", నగరంలోని అనేక దర్గాలు ఏటేటా ఉర్సులు ఘనంగా జరుపుకుంటాయి. విశేషమేమిటంటే వీటిలో ముస్లింల కంటే ఎక్కువగా పాల్గొనేది హిందువులే. ఈ సమాధులకు చెందిన యోగులకు మొక్కుకోడం, బలులు ఇయ్యడం, పూజలు చేయడం అనేకమంది హిందువులకు పరిపాటి. తురకలకు మొక్కులు మొక్కుకొని "మస్తానయ్య" "సైదులు" వంటి పేర్లు పెట్టుకోవటం ఎరిగినదే.

## నా మాట!

ఉత్పలమాలిక లొద్దు
ఉల్లిపూవొక్కటి చాలు!
చంపక మాలలు వద్దు
చెలీ! నీ తోడుంటే చాలు!!

నువ్వు వెదజల్లే నవ్వులు
సౌదలను మరిపించి
నా యెద మురిపించే
మువ్వల సవ్వడులు!

చెలీ! నీ తోడుంటే చాలు
కందపద్యాలల్లుతాను వందైనా!
నా కందనిది లేదంటాను యేందైనా!
నీ ప్రేమ వుంటే, చేదు, విందైనా!
ఇదే! ఇదే! నా మాట
ఏడు జన్మల ముందైనా!!

పి. శాంతమ్మ

హిందువులకు వారి మతం ఉండగా, వారిలో ఎందరో మహాపురుషులు ఉండగా, ఈ విధంగా మహమ్మదీయ మతాన్ని ఎందుకు ఆశ్రయిస్తున్నట్లు? ఇందుకు ఒకటే కారణం. హిందూమతం సర్వమత సహనాన్ని బోధిస్తుంది. దారులు వేరైనా గమ్యం ఒకటే, మతాలు వేరైనా మోక్ష ప్రాప్తి ఒక్కటే అని త్రికరణశుద్ధిగా విశ్వసిస్తుంది. ఈ భావన ప్రతి హిందువుకీ నరనరానా జీర్ణించిపోయింది. ఇతరులవలె వారి మతాలు తప్ప వేరేవి మంచివి కావు అని బోధించదు. నిజానికి ఇది ఎంతో ఉదాత్త లక్షణం. మాటలకు అందని గొప్ప లక్షణం. కాని ఈ ఉదాత్తతే హిందూ మతం పాలిటి పెద్ద బలహీనత అయింది. హిందువులు మహమ్మదీయుల దర్గాలకీ, క్రైస్తవుల చర్చిలకు వెళ్ళడం, మొక్కులు మొక్కుకోటం చూస్తే, వారు, హిందూమతంలో కంటే వారి మతాల్లోనే ఎక్కువ గొప్పదనం ఉంది కనుక వస్తున్నారు అని అనుకుంటున్నారే కాని, వారిలో ఉన్న ఔదార్యం కారణంగానని వారనుకోవడం లేదు. నిజానికి హిందువులకి గల పరమత సహనం వల్లనే ఈ దేశంలో ఇతర మతాలు దినదిన ప్రవర్ధమానం చెందగలుగుతున్నాయి. కాని వారి ఔదార్యమే వారిని బలహీనులను చేస్తూ వారి మనుగడకే భంగం ఏర్పడే పరిస్థితి వస్తోందని గ్రహించలేక పోతున్నారు.

నిజానికి ఖురాన్, ప్రపంచమంతటా, వేలాది, లక్షలాది మహాపురుషులు జన్మించి దైవసందేశాన్ని అందజేశారని చెప్తోంది. అయితే వారి లెక్కప్రకారం మహమ్మద్ మాత్రమే చివరి ప్రవక్త. అయన ముందు జన్మించిన మహాపురుషుల నందర్నీ ఇస్లాం గుర్తిస్తుంది. గౌరవిస్తుంది. కాని ఈ విషయాన్ని ఆచరణలో చూపే మహమ్మదీయు లెవరూ కనిపించరు. రంజాన్ పండగ సందర్భంలో మన ముఖ్యమంత్రి యన్. టి. ఆర్. ముస్లిం దుస్తులు వేసికొని మసీదులో ముస్లింలతో కలసి నమాజ్ చేశారు. ఇది ఆయన పొలిటికల్ స్టంట్ అనుకోండి. కాని త్రికరణశుద్ధిగా ఇస్లాంను గౌరవించే హిందువులు ఎందరో ఉన్నారు. కాని స్టంట్‌గానైనా హిందూమతం పట్ల, హిందూమత విశ్వాసాలపట్ల గౌరవం చూపి ఆదరించే మహమ్మదీయులు కనిపించరు.

నా ఉద్దేశ్యం హిందువులు ఇతర మతాలను గౌరవించడం మానాలని కాదు. మంచి ఎక్కడవున్నా నేర్చుకోవలసిందే. గొప్పతన మెక్కడ ఉన్నా గౌరవించవలసిందే. కాని మన చేష్టలు వేలంవెర్రి కాకూడదు. ఇతరులకు అలుసు అయ్యేటట్లు ఉండకూడదు. ఆగమశాస్త్ర ప్రకారం నిర్మించి, మహత్మ్యంగల దేవాలయాలలో ఆరాధించడంలో తప్పులేదు. అంతేకాని, ఓ గ్రానైట్ రాయికి, ఓ సిమెంట్ దిమ్మకి పసుపూ కుంకుమా రాసి దానికో గుడికట్టి పూజలు మొదలుపెడితే ఎవరికైనా మనమంటే చులకన భావం ఏర్పడుతుంది. ఇతరుల దర్గాలకు వెళ్ళవచ్చు. కాని వాటికే మొక్కులు పూజలు చేయడం సిగ్గుపడాల్సిన విషయం. మన ఆత్మగౌరవానికి భంగం రాకుండా ఇతరులని గౌరవించడంలో తప్పు లేదు. అప్పుడు ఇతరులూ మనల్ని గౌరవిస్తారు. ఈ వాస్తవాన్ని హిందువులు ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది. ★

# ఆ భవంతిని దయ్యాల కోసం కట్టారు!

## మనకు తెలియని ప్రపంచం

మల్లాది వెంకటకృష్ణమూర్తి

ప్రపంచంలో అతి విచిత్రమైన భవంతి అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో వుంది. దాని పేరు "విన్‌చెస్టర్‌హౌస్". ఆ భవంతిలో మొత్తం 170 గదులున్నాయి: ప్రతి గది నెంబరు పదమూడే. నిజానికి ఈ భవంతిని మనుషులకోసం కట్టలేదు, దయ్యాలకోసం. ఆ భవంతిలో పైకి వెళ్ళడానికి 13 మెట్లున్న మెట్లు మొత్తం 13 ఉన్నాయి. 13 చిమ్నీలున్నాయి. చలి కాచుకోడానికి 13 ఫైర్‌ప్లేసెస్ ఉన్నాయి. సీలింగు నుంచి వేలాడే షేండలియర్సు 13 ఉన్నాయి. ప్రతి షేండలియరుకు సరిగ్గా 13 బల్బులున్నాయి. ప్రతి తలుపు 13 చెక్కలు చేర్చి తయారు చేయబడ్డాయి. అలాగే ప్రతి తలుపుకి 13 తాళాలున్నాయి. వాటిల్లో చాలా భాగం తెరిస్తే ఎదురుగా గది బదులు గోడే కనపడుతుంది ఆ ఇంట్లో స్నానాల గదులు, వాష్ బేసిన్లు లాంటివేం లేవు, దయ్యాలు స్నానం చేయాల్సిన అవసరం ఉండదు కాబట్టి. అలాగే నీళ్ళ కొళాయిలు కూడా అమర్చలేదు,

దయ్యాలకోసం ఈ వింత భవంతిని నిర్మించడానికి ఒక చరిత్ర ఉన్నది. ఆలివర్ విన్‌చెస్టర్ అనే శాస్త్రజ్ఞుడు "విన్‌చెస్టర్ రిపీటింగ్ రైఫిల్"ని కనిపెట్టాడు. ప్రతిసారి తుపాకి పేల్చాక మళ్ళీ తూటాని అమర్చనవసరం లేకుండా వరుసగా బుల్లెట్లని పేర్పగలిగే సామర్థ్యం గల ఈ రైఫిల్స్‌తో కొన్ని వందలమంది చంపబడసాగారు. 1880 లో ఆలివర్ మరణించాక అతని భార్య సారాకి కి భర్తద్వారా 50 లక్షల డాలర్లు సంక్రమించాయి. ఆ డబ్బంతా అలాంటి రైఫిల్స్ అమ్మకం ద్వారా రాయిల్టీగా వచ్చిందే. ఆ పాపపు సొమ్ముతో జీవించడం సారాకి కష్టం అనిపించ సాగింది. నిద్రలో కూడా భయంకరమైన కలలు రాసాగాయి. తన భర్త కనిపెట్టిన మారణాయుధం వలన అనేకమంది మరణించడం ఆమె హృదయాన్ని కలచివేయ సాగింది. దాంతో, పరిహారంగా సారా ఆలా మరణించిన వారి ఆత్మ శాంతికోసం ఈ భవంతిని నిర్మించింది ఆమె వంటరిగా ఆ ఇంట్లో 1922 లో ఆమె మరణించేదాకా నివసించింది. సేవకులు చీకటి పడ్డాక ఆ భవంతిలో ఉండడానికి భయపడి వెళ్ళిపోయేవారు. ఆమె దయ్యాలతో మాట్లాడుతూ, ఆ భవంతిలో తిరుగుతుండేదని చెప్పుకొనేవారు. ఇప్పుడా భవంతిలో ఎవరూ నివసించడంలేదు. మరణించిన సారా ఆత్మ యింకా సంచరిస్తోందని చాలామంది నమ్మకం. ఆ భవంతి అక్కడక్కడ కూలడంకూడా ఆరంభమైంది. ★

" గృహిణీ గృహభాగ్య ముచ్యతే

గృహము యొక్క మహాభాగ్యమే గృహిణి. మగవాడెంతటి ఘనుడైనను గృహ గౌరవము నిలుపవలసిన బాధ్యత గృహిణి పైననే కలదు. గృహస్థాశ్రమము యొక్క పరమాశయ సిద్ధియు గృహిణి మీదనే యాధారపడియున్నది. సర్వము నిర్వహించెడివాడు పురుషుడైనను గృహ వైభవ మెప్పుడును గృహిణి మీదనే యుండుట సంఘ జీవితమున స్త్రీకి మనవారిచ్చిన ప్రాధాన్యమును సూచించుచున్నది. గృహము గృహిణిదే. ఇల్లాలు పదమీ యర్థమునే వ్యక్తీకరించుచున్నది.

— కల్లూరి చంద్రమౌళి

# దేవాలయాల్లో పెద్ద పెద్ద గంటలు ఎందుకుంచేవారు?

మన ప్రాచీన దేవాలయాల్లో పెద్ద పెద్ద గంటలు ఎందుకుంచేవారో ? ఎందుకని మోగించేవారో మీకు తెలుసా ?

**డా॥ జయంతి కృష్ణమూర్తి**

దానికెంతో వైజ్ఞానిక పరమైన ప్రయోజనం ఉందే దంటున్నారు శాస్త్రజ్ఞులు. లోహాల్ని ఒకదానితో నొకటి కొట్టి శబ్దాల నుత్పత్తి చేసినప్పుడు గాలిలో అనేక అల్ట్రా సోనిక్ శబ్దాలు ప్రేరేపితమవుతాయి. అవి వాతావరణ పొరలలోనికి వ్యాపించి రోగకారక సూక్ష్మ జీవులను నశింపచేస్తాయట. అందుకని దేవాలయాల్లో దేవునికి నైవేద్యం చేసేప్పుడు గట్టిగ గంటలు చాలాసేపు మోగించే అలవాటు ఏర్పడింది.

ఇప్పటికీ గ్రామాల్లో అంటువ్యాధులు, అవీ ప్రబలినపుడు డప్పులు, డమరుకాలు వాయిస్తూ జాతరలు చేస్తుండటం మనం చూస్తూనే ఉంటాము. అందులోని వైజ్ఞానిక అంతరార్థం కూడా ఇదే.

అల్ట్రాసోనిక్ ధ్వని తరంగాలు అంటే ఏమిటి ? వీటిని దేనితో కొలుస్తారు ? అంటే శబ్దతరంగాలన్నింటినీ హెర్ట్జ (Hertzs) లలో కొలుస్తారు. ఒక సెకండుకు ఒక పూర్తి కంపనాన్ని ఒక "హెర్ట్జ" అంటారు. ఒక మనిషికి వినికిడి శక్తి 20 Hz ల నుండి 20,000 Hz ల వరకు ఉంటుంది. ఆపైన ఏర్పడేవన్నీ అల్ట్రాసోనిక్ శబ్ద తరంగాలే ( Frequencies). కుక్కలు మొదలైన కొన్ని జంతువులు మాత్రమే వీటిని వినగలవు.

ఇంకా యీ అల్ట్రాసోనిక్ ధ్వని తరంగాలు ఈ ఆధునిక విజ్ఞాన యుగంలో మనకెన్నో విధాలుగా తోడ్పడుతున్నాయి. ప్రస్తుతం తయారయ్యే డిస్పోసబుల్ సిరెంజీలను యీ అల్ట్రాసోనిక్ ధ్వని తరంగాల్లోనే స్టెరలైజ్ చేసారు.

యీ శబ్దతరంగాలు ఇంకా మన కెన్ని విధాలుగా ఉపయోగపడుతున్నాయో వచ్చే సంచికలో తెలుసుకొందాం! ఏం ?

( సశేషం )

![జ్యోతిషవాణి]

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్

కవితా కామేశ్వరశ

అవనిగడ్డ - 521 121

ఆర్. మోహన్ — రాజమండ్రి

ప్రశ్న : ఉద్యోగ ప్రయత్నములు ఫలించునా ?

సమా : యీ 86 ద్వితీయ ఖండం అనుకూలించగలదు.

ప్రశ్న : గవర్నమెంటు సర్వీసు ఉంటుందా ?

సమా : ఉంటుంది.

జె వి. రమణ — నరసాపురం

ప్రశ్న : నా జాతకంలో Two marriages యోగ మున్నదా ?

సమా : లేదు. కాని అనుకున్న సంబంధం ఒకటి లేదా రెండు తప్పిపోవచ్చు. కళత్ర (దాంపత్య) సుఖం కొంచెం తక్కువ.

ఆర్. డి. యమ్. — అనకాపల్లి

ప్రశ్న : జాతకం చూడండి. దాంపత్యం ఎలా ఉంటుందని మీ అభిప్రాయం ?

సమా : "అధ్వాన్నం" గా ఉంది. సప్తమంలో పాప గ్రహమే అనుకుంటే వ్యయం (శయనస్థానం)లో కూడా మరో పాపి_ అగ్నికి వాయువు తోడు అన్నట్లు. దీనికి తోడు కుజదోషం_ యింకేం కావాలి.

అయితే 12లో శని వుంటే కుజదోషం పరిహార మగునని శాస్త్రవచనం కలదు.

"జామిత్రేచ యదా నౌరి
ర్లగ్నే వాహి బలకేపివా ।
అష్టమే ద్వాదశేవాపి
భౌమదోషో వినాశకృత్ "

అనగా 7_1_4_8_12 లలో శని వుంటే కుజదోష పరిహారమగు ననుట.

ప్రశ్న : కుజదోషం గలవారు కుజదోషంగల వారినే వివాహం చేసుకోవాలా ?

సమా : ఔను. శాస్త్రం అలాగే చెప్పును. దోషము Plus (+) అనుకోరాదు.

" ఏకత్ర హీనో మృతి...."

అంటుంది శాస్త్రం.

యన్. కె. ఆచార్య — సూర్యాపేట

ప్రశ్న : నాకు దైవసాక్షాత్కారం జరుగునా ? ఆర్థిక ఋణ విముక్తి ఎప్పుడు ? భావిజీవితం ఏలా గడుచును ? ఆయుః ప్రమాణమెంత ?

సమా : దైవ సాక్షాత్కారం సంగతి ఏమోగాని దైవాను గ్రహం కలుగుతుంది. ఋణవిముక్తికి ఇంకా 4 సం॥ పట్టును భావి జీవితం సంసారపక్షంగా ఉంటుంది. ఆయువు సుమారుగా 78 వరకు ఉంటుంది.

**జ్యోతిషవాణి**

పేరు ................................................

పూర్తి చిరునామా ........................................

........................................

........................................

లేఖ వ్రాయు తేది.....................

టైము పగలు/రాత్రి.....................

జనన తేది.............తేదిలేనిచో సుమారు వయస్సు

హాస్పిటల్‌లో అదొక గది. విశాలమయిన ఆ గదిలో చాలామంది మగవాళ్ళే ఉన్నారు.

వాళ్ళు పేషంట్లు కారు. పేషంట్లకి సంబంధించినవారు.

పేషంట్ల భర్తలూ... సోదరులూ... తండ్రులూ... ఓ ఇరవై పాతిక మందివరకూ వున్నారు. అందరూ కుర్చీలలో కూర్చుని ఎవరికోసమో ఆత్రంగా ఎదురు చూస్తున్నారు.




అప్పుడు వొచ్చిందామె. మనిషిని పూర్తిగా చూడకుండానే చెప్పెయ్యవొచ్చు ఆమె డాక్టరనీ....ఆ హాస్పిటల్ యిన్ - ఛార్జనీ. ఆమె తనకై - కొంచెం దూరంగానూ విడిగానూ వేసి ఉంచిన కుర్చీలో కూర్చుంది.

"ఈ సమావేశాన్ని - మనం సభగానే తీసుకుందాం. సభకు నా నమస్కారాలు. మిమ్మల్నందరినీ యిక్కడ సమావేశపరచడంలో నా ఉద్దేశ్యం - ఒక్కొక్కరికీ విడి విడిగా చెప్పే మాటలు, అందరికీ ఒకేసారి చెబుదామని. మీ అందరికీ నేను చెప్పవలసిందొక్కటే.... "

"ఏమిటి ? " తొందరపాటు మనిషెవరో అడిగేశారు ఆమె చెప్పేవరకూ ఆగలేక.

"మీకు సంబంధించిన పేషెంట్ - నవలా మానియాతో బాధపడుతున్నారు."

"నవలా మానియా ! ఈ జబ్బు పేరెప్పుడూ వినలేదే ? న్యూరోసిస్ .... మెంటల్ డిటార్డేషన్ .... యిటువంటి పేరే కాని .... "

"నిజమే. ఈ జబ్బు కొత్తది. దీనికి నేనే పేరు పెట్టాను. బహుశా యిది ఆంధ్ర దేశంలోనే పుట్టింది. ఇంకా పై రాష్ట్రాలకి వ్యాపించినట్లు లేదు

"ఈ జబ్బు నవలా మానియా లక్షణమేమిటి ? "

"నవలా మానియా అన్నా సీరియల్ న్యూరోసిస్ అన్నా ఒక్కటే. ఇది ఎక్కువగా ఆడపిల్లలకు వొస్తుంది. పధ్నాలుగు నుంచి పాతిక వరకూ మధ్య వయసు కల ఆడపిల్లలు దీనికి గురి ఔతారు. అక్షర జ్ఞానం ఉండి సీరియల్స్ చదివే .... అమాయకపు అమ్మాయిలే ఈ వ్యాధికి బలి ఔతారు. ఇల్యూషన్ (Illusion) హెల్యూసినేషన్ (hallucinatoin) ల వంటిదే యిదీను. జరిగేదేమిటంటే .... లేత వయసు ఆడపిల్లలు లోకజ్ఞానం లేనివారు .... అమాయకులు .... సీరియల్సూ నవల్సూ సరదాగానూ కాలక్షేపంగానూ మొదలుపెడతారు. కాల్పనిక సాహిత్యం కనుక అది వారిని యిట్టే ఆకర్షించుకుంటుంది. వాస్తవికతకు చాలా దూరంగా ఉండే ఆ కథా పాత్రలూ సన్నివేశాలూ వారి నమితంగా ఆకట్టుకుంటాయి. ఆ సీరియల్స్‌లోని నాయికలతో తమను తాము (identify) తాదాత్మ్యం గావించుకుంటారు. అలాగ ప్రారంభమౌతుందీ మానసిక బలహీనత. రానురానూ ఆ పాత్రే తానూ, తానే ఆ పాత్రా అని పూర్తిగా భ్రమ చెందేంతగా ముదిరిపోతుంది జబ్బు. వాళ్ళిక వాస్తవాన్ని చూడలేరు. వాళ్ళు చూడగలిగేదీ అర్థం చేసుకోగలిగేదీ ఆ సీరియల్ నవలా ప్రపంచాన్నే. దానితో వాళ్ళు సామాన్య పరిభాషలో "పిచ్చివాళ్ళౌతారు. "

" అంటే .... నేరస్థులు పుట్టరు. తయారు చేయబడతారు. (Criminals are not born but made). అన్నట్లే పిచ్చివాళ్ళు కూడా .... "

" సాధారణంగా పుట్టరు. తయారుచేయబడతారు. " అని వాక్యం పూర్తి చేసింది డాక్టరు.

" పిచ్చివాళ్ళని తయారు చేసేదెవరు ? " ఆవేశంగా అడిగారెవరో.

" నవలా మానియాక్స్‌ని తయారు చేసేది సీరియల్సూ నవలలూ. అంటే వాటిని రాసే రైటర్స్. "

" అంటే .... యీ పిచ్చివాళ్ళని తయారు చేస్తున్నది రైటర్స్‌న్నమాట. "

" ఔను. "

తరువాత డాక్టరు ఆ పేషెంట్లని – సీరియల్స్‌నుంచీ నవలల నుంచీ దూరంగా ఉంచడం .... షాక్ ట్రీట్‌మెంటూ .... వీటి ద్వారా ఎలా బాగుచేయవొచ్చునో చెప్పసాగింది, కానీ –

అప్పటికే ఆరేడుగురు యువకులు ఆగ్రహంతోనూ ఆవేశంతోనూ అవతలకి వెళ్ళిపోయి – ఓ చెట్టుకింద మీటింగు పెట్టేశారు. అందరూ ఒకేరకం బాధితులు. అందరిదీ ఆవేశమే. అందరికీ కడుపు మంటగానే ఉంది. గుండె రగులుతూనే ఉంది. అందుచేతనే వాళ్ళు అతి త్వరగా ఒక నిర్ణయానికి వొచ్చెయ్య గలిగారు.

ఆ నిర్ణయం చాలా దారుణమైనదని కానీ ప్రమాదకరమైనదని కానీ వారికెంతమాత్రమూ అనిపించలేదు సరికదా – అది వారికి అత్యంత సమంజస మయినదిగా మాత్రమే తోచింది.

ప్రాణానికి ప్రాణం, రక్తానికి రక్తం, జీవితానికి జీవితం.

విపరీతమయిన ఆవేశంతో .... యింకా విపరీతమయిన పట్టుదలతో వారు తీర్మానించుకుని – దేశంమీద పడ్డారు ఆలస్యం చేయకుండా. ఒక్కొక్కరూ ఒక్కొక్క మహాశక్తే అయ్యారు.

* * *

( జ రి గి న క థ )

దయానిధీ, రామచంద్రమూర్తి గేట్‌మెన్‌కి ఎడ్వాన్స్‌గా డబ్బు చెల్లించి మరీ లోపలకి వెళ్ళారు. లోపలకి వెళ్ళేసరికి వరండాలో వున్న అమ్మాయిలు చుట్టుముట్టి వాళ్ళ సభకు అధ్యక్ష, ముఖ్య అతిధులుగా వుండమన్నారు. ఒప్పుకోక తప్పలేదు వారికి. అక్కడ జీవితంలో అనురాగం తప్ప మరేమి అక్కరలేదు అని అనుకున్న అమ్మాయి నిజ జీవితంలో ఎలా మోసపోయిందో, ఇంకో అమ్మాయి పెళ్ళికిముందు మగవాడికే ఎందుకు అనుభవం ఉండాలి అని ఆమె చేసిన పనికి ఆమెని పతిత, భ్రష్ట అని ఎందుకు ముద్ర వేసారో, సాహసాలు చేయబోయి ఫొటోలు తీసి భంగపడిన ఆమె ఒకతి, క్షుద్ర సాహిత్యంతో ఒళ్ళు మరచిన ఆమె ఒకతి ఇవన్నీ చూసేసరికి రామచంద్రమూర్తికి చాలా బాధ వేసింది. ఆ తర్వాత నేటి సీరియల్స్ మీద రామచంద్రమూర్తి మా ట్లా డి న తర్వాత హాస్పిటల్ మనుషులు వచ్చి వాళ్ళని తీసుకెళ్ళారు. పిచ్చివాళ్ళ సభకి అధ్యక్షత వహించేసరికి ఇద్దరికీ పిచ్చి పిచ్చిగా వుండి ఇంటి ముఖం పట్టారు. ( ఇ క చ ద వ ం డి )

" మాది – సా హి త్యో ద్ధ ర ణ సమితి. కొత్తగా పెడుతున్నాం. మీవంటి ప్రముఖ రైటరుచేత ప్రారంభోత్సవం చేయించాలని మా సంకల్పం. ఈ సందర్భంలో మీకు పట్టు బట్టలు .... పర్స్ .... మీ రచనకి మంచి పారితోషికమిచ్చి సమరించడం – సంకల్పించుకున్నాం. మాకు ఎందరో ధనికుల అండదండలున్నాయి. దయచేసి

## నాలో నేను

తప్పుకో, తప్పుకో
తప్పించుకు పారిపో !

పాపపు కూపాలలోంచి
పాపిష్టి లోకం నుంచి
పాము పడగ నీడ లోంచి
ఒక్క క్షణం తప్పుకో !

పరుల కోసం తాపత్రయపడి
పొందిన పరాభవం చాలు
ఓరిమి పేరుతో పదేపదే
ఓడి పోకుంటే మేలు.

ఇకనైనా తెలుసుకో
ఇంకిన కన్నీళ్ళ విలువ.
స్వర్గం మనకొద్దుగానీ
సుంత శాంతి కోరుకో !

మనుషుల్నీ, మమతల్నీ
మరచిపోయి మసలుకో !
ఇంటి నుండి మదిని పట్టి
ఈశ్వరుని వైపు తిప్పి
ఇకనైనా తప్పుకో !
తప్పించుకు పారిపో.

- ఇంద్రగంటి జానకీబాల

మాతో రండి. మీ కోసం ఏ. సి. కంపార్టుమెంటులో సీటు రిజర్వు చేశాం."

ఇంత ఘనమయిన ట్రీట్‌మెంట్ ఎవరిస్తారని పొంగి పోతూ ఆ రైటర్ వారితో బయలుదేరింది.... మరో ప్రశ్న వేయకుండా. స్త్రీ సహజమయిన పట్టుచీర బలహీనత. మానవ సహజమయిన ధన బలహీనత. రచయితకు సహజమయిన పుస్తక ప్రచురణా బలహీనత.

ఆమెను కోరమాండల్ ఎక్కించారు తమతో. ఆ క్యాబిన్‌లో అంతా వాళ్ళే, ఆమె కాక. రైలు-రాజమండ్రి చేరడానికింకా అరగంట వ్యవధుంది.

"మీ సీరియల్‌లో హీరో హీరోయిన్లు రాజమండ్రి స్టేషన్‌లో దిగి - కాఫీ టిఫిన్లు సేవించి - కొంచెం ప్రేమించుకుని-మళ్ళీ-కోరమాండలే కదూ ఎక్కుతారు ?"

"ఔను." సగర్వంగా అందామె.

"హైదరాబాద్ బీచ్‌లో వాళ్ళ ప్రేమ పరాకాష్టనందు కుంటుంది.... ఏం ?"

"మరే." ఆమె ముసిముసి నవ్వులు నవ్వింది తన పాఠకులని చూసి వారి అభిమానానికి పొంగిపోతూ.

"కాని....కోరమాండల్ - రాజమండ్రిలో ఆగదు-" అన్నాడింకొకడు.

"మన రచయిత్రిగారు అపుతారు. రవి గాంచనిచో కవి గాంచును. రైల్వేవాళ్ళ కంటె రైటర్స్ ఎక్కువ శక్తివంతులు...."

"సరే....చూస్తాను. రచయిత్రిగారు రాజమండ్రిలో దిగి తీరవలసిందే. రైలాగిందా సరే. లేకపోతే...."

"లేకపోతే ?" భయంగా అడిగింది రచయిత్రి. అతనసలే రౌడీలా ఉన్నాడు.

"రైల్లోంచి రాజమండ్రి ప్లాట్‌ఫారం మీదకి తోసేస్తాను."

"ఆ !" భయంతో కొయ్యబారిపోయిందామె.

"నీ తెలిసీ తెలియని రాతలు నమ్మి .... నా చెల్లెలు రాజమండ్రిలో కోరమాండల్ ఆగుతుందని .... భ్రమతో దిగి .... దెబ్బలు తగిలి - పిచ్చాసుపత్రిలో ఉంది."

"కాని....నేను...."

"మేమేమీ వినం. రాజమండ్రిలో కోరమాండల్ ఆగదో - నువ్వు గోదావర్లో పడతావంతే."

ఇక – అనుక్షణం మృత్యుభీతి మొదలయిందామెలో. కొన్ని నిముషాలయ్యాక.... ఆమె యిక భయం భరించలేక.. మూర్ఛపోయింది. తప్పించుకునేందుకు దారిలేదు. వాళ్ళు తనని పకడ్బందీగా బంధించేశారు. వాటం చూస్తే రైలు రాజమండ్రిలో ఆగేటట్లులేదు .... అంటే .... తను .... గోదావర్లో ... ఊహించుకోలేక భయంతో మూర్ఛపోయిందామె.

ఊరికి ఒక చివరనున్న ఐదు నక్షత్రాల హోటల్. పై అంతస్తులోని ఒకగదిలో రచయిత్రి. ఆమె విలాసంగా కాఫీ తాగుతోంది. ఆమె కట్టుకున్న పట్టుచీర – సాహిత్యోద్ధరణ సమితివారు బహూకరించినది. ఆమె వ్యానిటీ బ్యాగ్‌లోని వెయ్యినూటపదహార్లు ఆ సమితి వాళ్ళందించినవి. ఇంకా వాళ్ళు వొచ్చి సభకు తీసుకు వెళ్ళరేమా అని నిరీక్షిస్తూ.... ఊరికే ఉండడమెందుకని కాఫీ తాగుతూంది రచయిత్రి.

వాళ్ళు వొచ్చారు.

ఒకరూ యిద్దరూ కాదు, ముగ్గురు!

ఒకడు తలుపువద్ద అడ్డంగా ఉండిపోయాడు.

రెండోవాడు – "రచయిత్రి గారూ!" అంటూ పిలిచాడు.

అప్పుడు చూసిందామె వాళ్ళని. "సభ సిద్ధమయిందా?"

"ఔతూంది. ఈలోగా .... మీరోసారి మూర్ఛపోరూ?"

ఆమె – అర్థమవనట్లు అయోమయంగా చూసింది.

"మీ సీరియల్‌లో హీరోయిన్‌ని మరచిపోయారా?"

"అదా!" నవ్విందామె. "అది – నవల."

ఆమె ఎంత తేలికగా అందో అతనంత సీరియస్‌గానూ కఠినంగానూ అన్నాడు. "కాని .... ఆ నవల చదివే .... ఆ నాయికి ననుకరించే - మా చెల్లెలు మూర్ఛ రోగిఐ – జీవితాన్ని భవిష్యత్తునీ నాశనం చేసుకుని పిచ్చాసుపత్రి పాలైంది."



దానికి నా బాధ్యతేమీలేదు."

"సిగ్గు పడాలి ఆ మాట అనేందుకు. రచనకు బాధ్యత రచయితది కాక మరెవరిది? మీరు మర్యాదగా మూర్ఛ పోతే సరే లేక పోతే బలవంతంగా మూర్ఛ పోగొడతాం."

"ఏమిటీ దౌర్జన్యం? అరుస్తాను."

"వినిపించుకొనేదెవరు?" వికృతంగా నవ్వాడు. "మేమెవరమూ పట్టుకోము. మూర్ఛ పొండి." ఆజ్ఞాపించాడు. ఆమె భయంతో నిజంగానే కళ్ళు తిరిగి పడింది. ఎవరూ పట్టుకోలేదు. గచ్చుమీద పడింది. నుదిటిమీద తక్కువ దెబ్బ తగలలేదు.

"ఇంకెప్పుడూ మూర్ఛల నవలలు వ్రాయను. లోపాలని గ్లామరైజ్ చేయను." ముమ్మారనిపించారామెచేత తెలివొచ్చాక. (సశేషం)

# హిత వాణి



ప్రపంచంలో ఏ విలువలు ఎలా ఉన్నా మాట విలువకు మార్పు లేదు. మనిషికి విలువ ఉన్నంత వరకు మాటకు విలువ ఉంటుంది. మనిషికీ మనిషికీ మధ్య మమకారాన్ని పెంచేది మాట. రాగాన్ని ద్వేషంగా మార్చేది కూడా మాటే. తన మనసులోని మాటను తన తోటివారికి చెప్పుకొని కష్టాలను పంచుకొని సుఖాలను పెంచుకొని కష్ట సుఖాల కలయికతో వెలుగు నీడల విచిత్ర లీలను వినోదంగా వివేకంతో గమనిస్తూ జీవిత యాత్రలో పురోగమించేందుకు మాటలు క్షేమతండులాల మూటలుగా సహకరిస్తాయి. మంచి మాటలు మనసులోని మాధుర్యాన్నీ మనిషిలోని సౌజన్యాన్నీ పదిమందికి పంచి పెడతాయి. ఆ మాటలనే మహనీయులు మననం చేసుకొని మంత్రాలుగా మలచుకుంటారు. మననం చేయగా చేయగా మామూలు మాటలు కూడా మంత్రాలవుతాయి. మంత్రాలు వాటిని మననం చేసే మనిషిని మనీషిగా మారుస్తాయి. అందువల్లనే 'మాటల చేత దేవతలు మన్నన చేసి' వరాలను అనుగ్రహిస్తారని మాటలలోని మర్మం తెలిసిన వాఙ్మయ తపోధనులంటారు. అది అక్షరాలా నిజం.



డా॥ ఇలపావులూరి పాండురంగరావు



అసలు మాట్లాడట మనేది ఒక కళ. అది అందరికీ చేతకాదు. మాట్లాడటం నేరిస్తే పోట్లాట లేదని పెద్దలు ఊరికే చెప్పలేదు. అందులో అభిజ్ఞుల అనుభవసారం ఇమిడి వుంది. ఏ సమయంలో ఎవరితో ఎలా మాట్లాడాలో తెలుసుకొని ఇతరుల మనస్సును నొప్పించకుండా తనకు ఇబ్బంది లేకుండా కమ్మని మాటలతో కాలక్షేపం చేసేవాడు ధన్యుడని ఒక ధన్యజీవి తన సుమతికి హితవు చెప్పుకున్నాడట. అది లోక హితం. దానినే **ఆత్మ హితంగా** ఆధ్యాత్మిక పరిభాషలో గీతాచార్యులు వివరిస్తూ వాఙ్మయ తపస్సని దానికి నామకరణం చేస్తారు.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చయత్
స్వాధ్యాయా భ్యసనంచైవ వాఙ్మయం తప ఉచ్యతే.

ఇతరులను ఉత్తేజపరచకుండా తాను ఉత్తేజ పడకుండా మాట్లాడటం వాఙ్మయ తపస్సుకు మొట్టమొదటి మెట్టు. ఇతరులు పరుషంగా మాట్లాడినప్పుడు తాను ఉద్రిక్తత చెందకుండా ప్రశాంతంగా ప్రసన్నంగా సమాధానం చెప్పగలగాలి. అలాగే ఇతరులకు ఉద్రేకం కలిగించే మాటలు తన నోట వెలువడ కూడదు. ఇలా అందరూ ప్రయత్నిస్తే ప్రపంచమంతా ప్రశాంతి నిలయమవుతుంది. అందరూ అంతటి శాంతమూర్తులు కాకపోవచ్చుకాని కనీసం కొందరయినా ఇలాంటి వాక్సంయమం పాటించగలిగితే పొల్లుమాటలవల్ల వచ్చే పోట్లాటలు చాలా వరకు ఉపశమిస్తాయి. మమకారంలోని మాధుర్యం మనుష్య జాతికి బోధపడుతుంది.

మాటల బాటలో ఇంతవరకు పయనిస్తే ఆ తర్వాత "సత్యం" అనే రెండో మెట్టు అందుతుంది. "సత్యం వద" అని తైత్తిరీయం శాసిస్తుంది. అది వేదవాక్యం సత్యాన్ని మించిన తపస్సు లేదని (సత్యాన్నాస్తి పరం తపం) సత్య నిష్ఠులన్నారు. నిజం చెప్పటం చాలా సులువుగానే కనిపిస్తుంది. కాని నిజం మాత్రం చెప్పగల నిజాయితీపరుడు నిజంగా ప్రపంచంలో ఉన్నాడా అని సత్త్వగుణ సంపన్నులకు కూడా సందేహం ఉదయిస్తుంది. అయినా జీవితంలో అష్టకష్టాలు పడి అడవులపాలయి కూడా సత్య నిష్ఠను వదలని సత్యసంధులనేకులున్నారు. అన్ని దేశాలలో ఉన్నారు. అన్ని కాలాలలో ఉన్నారు. అబద్ధాలు చెప్పి అప్పటికప్పుడు అభ్యుదయాన్ని సాధించే కార్య

సాధకులూ ఉన్నారు. సత్యాన్ని సాధించేందుకు స్వార్థానికి స్వస్తి చెప్పాలి. స్వార్థ పరిత్యాగమంటే స్వంత లాభాన్ని పూర్తిగా వదలుకోమని కాదు. లోభంలేని లాభం అందరికీ అభ్యుదయకారిగా ఉంటుంది. ఇలాంటి సంయమాన్ని అలవరచుకుంటే సత్యాన్ని సాధించటం అంత దుస్సాధ్యం కాదు.

కాని గీతాచార్యులు బోధించిన సత్యంలో మరో చిక్కుంది. ఉన్నమాట ఉన్నట్టు చెప్పినంత మాత్రాన అది సత్యనిష్ఠ అనిపించుకోదు. ధర్మసమ్మతమయిన కార్య నిర్వహణకు సత్యం సహకరించాలి. "సత్యం వద" ఎంత సత్యమో "ధర్మం చర" అనేది కూడా అంత తథ్యం. ఈ రెండింటిని సమన్వయించుకుని పోవాలంటే సత్యం ప్రియకరంగా ఉండాలి, హితకరంగా ఉండాలి. చెప్పిన మాట నిజమయినా కష్టె విరిచినట్టు చెప్పకూడదు. మనసు నొచ్చకుండా చెప్పాలి. కాని హితవు చేకూర్చే మాటలే చెప్పాలి. ముఖప్రీతి మాటలు చెప్పి మొదటికి మోసం తీసుకురాకూడదు. ఈ భావాన్నే గీతాచార్యులు "సత్యం ప్రియహితం" అని చెప్పారు. దీనికి చాలా నేర్పు రావాలి. దానినే వాగ్విలాసం, వాగ్విదగ్ధత లేక వాక్చాతుర్యం అంటారు. హితం చెప్పటమే ధ్యేయం. కాని చెప్పవలసిన మాటను ఎంత మధురంగా, సరసంగా, సాంకేతికంగా చెప్పగలిగితే అందులోని సత్యం అంత సార్థకమవుతుంది. మంచీ (శివమ్), మార్దవం (సుందరమ్) సత్యం సాధించవలసిన రెండు మానవ లక్ష్యాలు. ఈ రెండింటిలో ఏది లోపించినా సత్యం వల్ల సాధించవలసిన ప్రయోజనం సిద్ధించదు.

కాని యిలాంటి నేర్పు ఎలా అలవడుతుంది ? దీనికి సమాధానం ఈ శ్లోకంలోనే రెండవ చరణంలోని రెండు మాటల్లో వుంది. అందులో మొదటిది స్వాధ్యాయం. రెండవది అభ్యసనం. స్వాధ్యాయమంటే సామాన్యంగా మనం వేదాధ్యయనమని అర్థం చెప్పుకుంటాం. కాని అది చాలా సారగర్భితమయిన పదం. స్వ, అధి, అయం - మూడు తత్త్వాలను సమన్వయించుకున్న సమర్థ పద విధి యీ చిన్నపదంలో కనిపిస్తుంది. తనలోని లోతును గుర్తించి తనను తాను తెలుసుకోవటమే స్వాధ్యాయం. తనను తాను తెలుసుకున్న తర్వాత తదనుగుణంగా ప్రవర్తించటమే అభ్యసనం. తెలుసుకోవటం మొదటి మెట్టు. తెలుసుకున్న తర్వాత తెలివిగా మెలగటం రెండవ మెట్టు. మొదటిమెట్టు జ్ఞానానికి సంబంధించినది. రెండవ మెట్టు కర్మకు ( ఆచరణకు ) సంబంధించినది. సత్యం ఈ రెండింటికీ సంబంధించింది. ఈ మూడూ ఒక దానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. తెలివిగలవాడే తెలివిగల పని చేయగలుగుతాడు. మంచిపనులు చేసే వ్యక్తినే జ్ఞాని అంటారు. ఈ రెండింటికీ సత్యనిష్ఠ, త్రికరణశుద్ధి అవసరం. మనస్సు, వాక్కు, కర్మ ఒకదాని నొకటి అనుసరించి నడవాలి. మనసులోని మాటను వాక్కు చెప్పాలి. వాక్కు ప్రవచించినట్టు ఆచరణ జరగాలి. అప్పుడే జీవితంలో సామరస్యం చేకూరుతుంది. సకలేంద్రియసారం వాక్కు. మనస్సును సుమనస్సుగా మార్చేది వాక్కు. ఆచరణకు ఆధారం వాక్కు. అలాంటి వాక్కును మానవాభ్యుదయం కోసం వెలయించిన మహనీయులు వ్యాస వాల్మీకుల కాలం నుండి ఈనాటి వరకు మనదేశంలో ఎందరో ప్రభవించారు. తమకు తోచిన హితవును తమ తోటి వారికి చెప్పి మనుష్య జాతికి మంచితనం మీద మమకారం ఏర్పడేట్టు చేశారు. అలాంటి మహనీయుల హితవాణిని మనం శ్రీవాణి ముఖంగా స్మరించుకుందాం. ★

## ప్రశ్నలు - సమాధానాలు

1. ఏ దేశాలను కామన్‌వెల్త్ దేశాలని పిలుస్తారు ?
2. "బ్లాక్ పగోడా" అను ప్రదేశము ఎక్కడ ఉన్నది ?
3. ప్రపంచంలో మిక్కిలి పెద్ద గ్రంథాలయమేది? అది ఎక్కడ ఉన్నది ?
4. " స్విమ్మింగ్ సిటీ " అని ఏ నగరమును పిలుతురు ?
5. "సారేజహాసే అచ్ఛా, హిందుస్థాన్ హమారా" అను గీతమును రచించిన దెవరు ?
6. మానవహక్కుల దినము ఏది ?
7. భారతదేశంలో పొడవైన బ్యారేజ్ ఏది ?
8. అంతరిక్షంలోని "బ్లాక్‌హోల్స్"ను కనుగొన్న దెవరు ? అతడు ఏ దేశస్థుడు ?
9. "హర్ష చరిత్ర"ను రాసిన దెవరు ?
10. ప్లాస్టర్ అఫ్ పారిస్ ఏ లోహము నుండి లభ్యమగుచున్నది ?
11. ప్రపంచంలోకెల్లా ఎక్కువ జనాభా కలిగిన నగరమేది ? ఆ నగరము ఏ దేశంలో ఉన్నది?
12. మనదేశంలో కెల్లా పెద్ద నగరమేది ?

★ ★

1. బ్రిటిష్ వారి క్రింద పరిపాలింపబడి స్వతంత్రమైన దేశాలు, 2. కోణార్క్, 3. 'యునైటెడ్ స్టేట్స్ లైబ్రరీ అఫ్ కాంగ్రెస్' U. S. A. లో 4. బ్యాంకాక్, 5. మహ్మద్ ఇక్బాల్, 6. డిసెంబరు, 10, 7. గాంధీ సేతు 8. సుబ్రమణ్య చంద్రశేఖర్ ; భారత దేశస్థుడు, 9. బాణభట్టు, 10. జిప్సమ్, 11. షాంఘై ; చైనాలో ఉన్నది. 12. కలకత్తా.

# స్త్రీ చైతన్యము - సదస్సు

విద్యావంతులైన పట్టణ స్త్రీలు గ్రామాలకు తరలి వెళ్ళి నిరాక్షరాస్యులైన గ్రామీణ స్త్రీలను విద్యావంతులుగా చేసినప్పుడే నిజమైన స్త్రీ చైతన్యం వస్తుందని, అప్పుడే దురాచారాలు, మూఢాచారాలు అదృశ్యమవుతాయని, విద్య అంటే కేవలం చదవడం, వ్రాయడం, డిగ్రీలు సంపాదించడం మాత్రమే కాదని, వివేక, వినయ, విజ్ఞానాదులను సముపార్జించడమని, దానితోపాటు సంస్కారం, సచ్ఛీలములను పెంపొందించుకోవాలని, విద్యావంతులైన స్త్రీలు సహితం రానురాను వంట ఇంటికే పరిమితం కాకుండా అన్ని రంగాలలో ముందంజవేయాలని బందరు బాలాజీ విద్యాలయంలో ది 21-4-1986న జరిగిన "స్త్రీ చైతన్యం" సదస్సులో పలువురు మహిళావక్తలు తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు.

స్త్రీలు ఏపాటి చైతన్యం కలిగి మెలుగుతున్నారో వారి చేతనే చర్చించబడటం సముచితమని నిర్వాహకులు శ్రీ కొమరగిరి (శ్రీవాణి సంపాదకులు) భావించి వివిధ రంగాలకు చెందిన మహిళా వక్తలను ఎంపిక చేశారు. ఈ మధ్యకాలంలో యింత పెద్ద మహిళా సదస్సు బందరులో జరుగలేదు. మహిళలతోపాటు స్త్రీల మనోభావాలు ఎలా ఉంటాయో పరిశీలిద్దామనే కుతూహలంతో పురుషులు కూడా ఈ సదస్సులో పాల్గొనడం విశేషం. మహిళావక్తలు నిర్భయంగా నిస్సంకోచంగా తమతమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. ప్రముఖ సాంఘిక సేవా పరాయణురాలు శ్రీమతి వేమూరి లక్ష్మీశారద అధ్యక్షత వహించిన ఈ సదస్సులో ప్రముఖ గాంధేయవాది, అపరవాల్మీకి బిరుదాంకితులు శ్రీ కోసూరి సుబ్బారావు రచించిన "స్త్రీ చైతన్యం" పుస్తకమును, ప్రఖ్యాత నవలా రచయిత్రి శ్రీమతి తమిరిశ జానకి ఆవిష్కరించారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా స్త్రీకి నిజమైన స్వాతంత్ర్యం రాలేదని, 1975 సం. ను అంతర్జాతీయ మహిళా సంవత్సరంగా ప్రకటించి ఒక దశాబ్ద కాలంపాటు చర్చలు ఆర్భాటంగా జరిగాయి గాని, ఆశించిన ప్రయోజనం సిద్ధించలేదని, ఆర్థిక సమానత రావాలని, అది స్త్రీకి ఆస్తి హక్కు యివ్వడంద్వారానే లభ్యమవుతుందని సదస్సుకు అధ్యక్షత వహించిన శ్రీమతి వేమూరి లక్ష్మీశారద పేర్కొన్నారు.




ప్రముఖ కథా, నవలా రచయిత్రి శ్రీమతి అక్కల సరస్వతీ బాబూరావు సదస్సును ప్రారంభిస్తూ ఒకప్పుడు ఈ సమాజంలో స్త్రీకి సముచితమైన స్థానం ఉండేదని, అన్ని రంగాలలో ఆధిక్యతను పొంది గౌరవించబడేదని చెబుతూ రుద్రమ్మ, మాంచాల, ఝాన్సీ లక్ష్మీబాయిలను ఉదహరించారు. పురాణ కాలంనుండి స్త్రీల పేర్లతో పురుషుల పేర్లు రావడం మన సాంప్రదాయమని పేర్కొన్నారు. అయితే రానురాను సమాజంలో స్త్రీకి ప్రాధాన్యత తగ్గుతూ వచ్చిందని చెప్పారు. ఉత్తమ రచనల ద్వారా స్త్రీ చైతన్యం కలుగుతుందని, విదేశాలలో టాల్‌స్టాయి, జేన్ ఆస్టిన్, ఎమిలీ జోలా, వర్జీనియా ఉల్ఫ్ వంటి రచయిత్రుల రచనలు సమాజ పరిస్థితి మారడానికి దోహదం చేశాయని స్పష్టం చేశారు. మంచి సాహిత్యం వలన మంచి చైతన్యం సమాజంలో వస్తుందని ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించవలసిన అవసరం ఎంతైనా ఉన్నదన్నారు.

ముఖ్య అతిథిగా పాల్గొన్న ప్రముఖ బాలసాహిత్య రచయిత్రి శ్రీమతి డి. సుజాతాదేవి (విజయవాడ) మాట్లాడుతూ మనిషి సంస్కారంమీద సాహిత్యపు పోకడ ఆధారపడి వుంటుందని, సంస్కారం లోపించడం సమాజంలో సహించరాని నేరమని, నేటి స్త్రీలు పురాణకాల స్త్రీలైన సీత, సావిత్రి, ద్రౌపది, రుక్మిణి, సత్యభామలతో పోలిస్తే వారికన్నా వీరు ప్రగతి పథంలో నడుస్తున్నారనడం సందేహాస్పదమన్నారు. బుచ్చిబాబు, కొడవటిగంటి రచనలు స్త్రీ చైతన్యానికి దోహదం చేశాయన్నారు. సనాతన ఆచారాలు స్త్రీకి ప్రతిబంధకంగా తయారైనాయని, భారతదేశంలో స్త్రీ ఉద్యోగం చేస్తున్నా, వంటఇంటి పని చేయక తప్పడం లేదని, విదేశాలలో స్త్రీలు, పురుషులు అన్ని పనులు కలిసి పంచుకొని సమానంగా చేసుకుంటారని చెప్పారు.

"స్త్రీ చైతన్యం" పుస్తకమును ఆవిష్కరించిన ప్రఖ్యాత నవలా రచయిత్రి శ్రీమతి తమిరిశ జానకి మాట్లాడుతూ కందుకూరి వీరేశలింగంగారిని ఈ సదస్సులో స్మరించవలసిన అవసరం ఎంతైనా వున్నదని చెప్పారు. వారి సంఘ సంస్కరణలు స్త్రీ చైతన్యానికి ఎంతగానో దోహదం చేశాయన్నారు. ఒక విధముగా స్త్రీలు విద్యావంతులు కావడం వలన, ఉద్యోగాలు చేసే స్త్రీల సంఖ్య పెరగడం బట్టి స్త్రీలలో చైతన్యం కొంతవరకు వచ్చినట్లుగా గుర్తించవచ్చునన్నారు. అయితే వరకట్నం విషయంలో పురుషులకన్నా, స్త్రీలలోనే కాంక్ష ఎక్కువగా ఉందన్నారు. అనేక సందర్భాలలో స్త్రీకి తోటి స్త్రీయే కంటకంగా తయారుకావడం శోచనీయమన్నారు. అందువలన స్త్రీలలో ముఖ్యంగా మానసిక పరివర్తన రావాలన్నారు.

శ్రీమతి ఎ. రాజేశ్వరి మాట్లాడుతూ స్త్రీలలో చైతన్యం మనదేశంలో పురాణకాలంనుండి ఉన్నదని, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఒక మహిళ (శ్రీమతి ఇందిరాగాంధి) ప్రధాని కావడం దీనికి నిదర్శనమన్నారు. సమాజంలోని సాంఘిక దురాచారాలను వెలికి తీసుకుని రావడానికి పత్రికలు ఎంతగానో పనిచేస్తున్నాయని, దుర్గా బాయి దేశముఖ్ నుండి దుల్లా రమణమ్మగారి వరకు ఎంతోమంది మహిళలు స్త్రీ చైతన్యం కోసం కృషి చేశారని చెప్పారు.

ఆంధ్ర జాతీయ కళాశాల లెక్చరర్ శ్రీమతి జంధ్యాల కిరణ్మయి మాట్లాడుతూ స్త్రీ ఎప్పుడూ చైతన్యవంతురాలేనని అయితే ఆమె ఆశలు ఆశయాలు పురుషపుంగవుల ఆధిక్యత వలన అణచిపెట్టుకొని ఉండాల్సిన పరిస్థితి కల్గిందని విచారం వెలిబుచ్చారు. ఇక మన స్త్రీలలో False Prestige ఎక్కువ కావడం వలన సామాన్య మధ్యతరగతి కుటుంబీకులు అనేక అవస్థలపాలవుతున్నారని, గొప్పలకు



పోకుండా ఉన్నదానితో కష్టపడి పనిచేసి సుఖంగా జీవించడం నేర్చుకోవాలన్నారు. అభివృద్ధికి సంపద కొలబద్ద కాదు. సంస్కారం ముఖ్యం. ఒక్క డబ్బే మానసిక ఆనందాన్ని చేకూర్చలేదు. కనుక డబ్బే జీవిత పరమావధి కారాదు. కట్నం తీసుకునే విషయంలోను, పోటీపడి ధనవ్యయం చేసే విషయంలోను మనం సంస్కారాన్ని చూపించడంలేదు. అమెరికాలో ఆలస్యంగా స్త్రీకి ఓటు హక్కు వచ్చినా, అక్కడి స్త్రీలు భారతదేశంతో పోలిస్తే అనేక రంగాలలో ముందున్నారని, అంతర్జాతీయ కార్మిక సంస్థ అంచనాల ప్రకారం ప్రపంచం మొత్తంమీద 6. 250 లక్షల ఆడవారు పని చేస్తున్నారని చెబుతూ వివిధ దేశాల పరిస్థితులను వివరించే గణాంక వివరాలు తెలిపారు.

ఇన్నర్‌వీల్ క్లబ్ ప్రెసిడెంటు శ్రీమతి సుంకర గంగా బాయమ్మ మాట్లాడుతూ ఆదర్శ దాంపత్యమును గురించి వివరించారు. దాంపత్య జీవితంలో ఒకరు ఎక్కువని, మరొకరు తక్కువని, భావించరాదు. ఒకరు ఆహార సామాగ్రిని సంపాదించడం రెండవవారు దాన్ని జాగ్రత్త చేయడం అన్న సూత్రాన్ని అంగీకరించాలి. పౌరుషం, పొచ్చసు లేకుండా ఒకరి మాట నొకరు శిరోధార్యంగా ఎంచుకుంటూ అనుకూలంగా సమస్యలన్నింటినీ ఓర్పుతో పరిష్కరించుకుంటూ పోయేదే ఆదర్శ దాంపత్యమన్నారు.

శ్రీమతి మల్లాది రుక్మిణీదేవి మాట్లాడుతూ స్త్రీ శక్తికి చిహ్నమయినా ప్రవృత్తిరీత్యా చంచలత్వం కలిగినదనీ, పురుషుడు స్థిరత్వానికి నిదర్శనమని చెబుతూ స్వతంత్ర భారతంలో స్త్రీలు అన్ని రంగాలలో ముందంజవేస్తున్నారని చెప్పారు. స్త్రీ జాతికి స్వజాతే శత్రువని, స్త్రీ లేని పురుషుడు సమాజంలో అబలుడని చెప్పారు. స్త్రీని స్త్రీయే ఉద్ధరించుకోవాలని, తన శక్తి ద్వారానే సర్వలోక సామ్రాజ్ఞి కావాలన్నారు. వివాహ వ్యవస్థలో మార్పు రావాలని, కట్నం అంటూవుంటే పురుషుడే స్త్రీకి కట్నం ఇవ్వాలని చెప్పారు. జీవనసాగరంలో స్త్రీ పురుషులు అన్ని విధాలా సమ ఉజ్జీలు. ఈ భావమే ఈనాటి స్త్రీకి కావల్సిన చైతన్యం అని పేర్కొన్నారు.

## మగువ బ్రతుకు

తరాలు తరలినా...
యుగాలు దొరలినా...

మనిషి బుద్ధి ఎదుగలేదు
మగువ బ్రతుకు మారలేదు
మమత సమత పెరగలేదు
మహిళ స్థానం మారలేదు...

మనసు లేదు...మమత లేదు
ప్రేమ లేదు...కరుణ లేదు
చూడలేదు...ఓర్వలేదు
మనిషి బుద్ధి ఎదుగలేదు...

జాలి లేదు కరుణ లేదు
కట్నమిచ్చిన తృప్తి లేదు
ఎంత పెట్టిన ఆశ పోదు
మనిషి బుద్ధి ఎదుగలేదు...

ఎన్ని చదువులు చదివినా...
ఎంత ప్రతిభను పొందినా...
మారలేదు...మార్పులేదు
మనిషి బుద్ధి ఎదుగలేదు...

కందుకూరి ఆశయాలు
తీరునా...నెరవేరునా
ఎంతకాలం...వేదనా...
ఇంకెంతకాలం...వేదనా...ఆవేదన

- కొమరగిరి

శ్రీమతి పింగళి సీత మాట్లాడుతూ "స్త్రీ చైతన్యం" అంటే కదలిక. మనసుకున్న ఆలోచనా శక్తిని మూత పెట్టేసి స్తబ్దుగా వుండిపోయిన స్త్రీలలో ఆలోచనా శక్తిని కలిగించాలి. ప్రతి మనిషిలో క్రూరత్వం, మానవత్వం, దైవత్వములుంటాయి. క్రూరత్వాన్ని పారద్రోలి,

మానవత్వాన్ని పెంపొందించాలి. ఎదుటివారిని ప్రేమించడం, దయగా చూడడం నేర్చుకోవాలి. ప్రతి స్త్రీకి సమాజ సేవ చేయడానికి అవకాశం వుండపోవచ్చును. కనుక తన చుట్టూవున్న వారికి, తన ఇంట్లో పనిచేసేవారికి వీలైనంత సహాయం చేయడం నేర్చుకోవాలి. ఆ చింతన కలిగినప్పుడే నిజమైన చైతన్యం వస్తుందన్నారు.

రిటైర్డ్ హెడ్ మిస్ట్రెస్ హెచ్. వి. యల్. ప్రసూనాంబగారు మాట్లాడుతూ స్త్రీలలో చైతన్యం లేదని భావించడం పొరపాటని, ఋగ్వేద కాలంలోనే గార్గి, మైత్రేయి లాంటి మహిళలు ఎన్నో రచనలు చేశారని, మండన మిశ్రుని భార్య 'ఉభయ భారతి' ఆదిశంకరాచార్యులతో వాదన చేసి తన ప్రతిభను చాటిందని, మొల్ల, రామాయణం రచించిందని పేర్కొన్నారు. అయితే రానురాను స్త్రీలు వెనుకబడుతూవచ్చారని, పూర్వ చైతన్యాన్ని తిరిగి పొందేందుకు స్త్రీలు కృషి చేయాలన్నారు.

హిందూకాలేజి లెక్చరర్ కుమారి మంగళగిరి ప్రమీలాదేవి మాట్లాడుతూ ప్రతి పురుషుడు సాధించిన విజయం వెనుక స్త్రీ ఉందని పేర్కొన్నారు. ఈనాడు మధ్య తరగతి స్త్రీలకే ఎక్కువ సమస్యలని, చట్టాలు ఆశించిన మార్పులను తీసుకొని రాలేక పోతున్నాయని ఈనాటి స్త్రీ సమస్యలు చాలా సునిశితమైనవని, బహుముఖమైనవని పేర్కొన్నారు. ప్రాచ్య నాగరికతలో స్త్రీ గృహ ధర్మాన్ని అనుసరించడం వలన ఏ దశలోను సమస్యలు ఉత్పన్నం కాలేదని, కాని నేటి అధునాతన సమాజ పరిస్థితి వేరన్నారు. రచయితల బాధ్యత స్త్రీ సమస్యలను వెలుగులోనికి తేవడమని, అయితే స్త్రీ [illegible] త్రులు వారి గురుతర బాధ్యతను ఎంతవరకు [illegible] హిస్తున్నారు [illegible] ని ప్రశ్నించారు.

శ్రీవాణి సంపాదకులు శ్రీ కామరగిరి కృష్ణమోహనరావు సదస్సులో చర్చించిన విషయాలను సమీక్షిస్తూ స్త్రీలను విద్యావంతులను చేయటమంటే డిగ్రీలు పొందేట్లు చేయడం మాత్రమే కాదని, [illegible] వివేకములను కలుగజేయాలని, సచ్ఛీల సంస్కారవంతులుగా తీర్చి దిద్దాలని పేర్కొన్నారు. అందుకోసమే "విద్య వినయ సంపన్నః" అన్నారు పెద్దలు. వినయం లేని విద్య బూడిదలో పోసిన పన్నీరులా వృధా అయిపోతుందని చెప్పారు. Home is the first school for children అన్నారు పెద్దలు. ఇంటి వాతావరణమును చక్కదిద్దవలసిన బాధ్యత ముఖ్యంగా తల్లిమీద ఉంటుంది. తల్లి విజ్ఞానవంతురాలు కావాలి. ఒక్క స్త్రీని విద్యావంతురాలిగా చేస్తే ఆ కుటుంబమే చైతన్య మవుతుందని పేర్కొన్నారు. కనుక ప్రతి స్త్రీ తన కుటుంబమును మొదట చక్కదిద్దుకోవాలి. అందుకోసమనే " ఇంట గెలిచి రచ్చగెలవ "మన్నారు పెద్దలు. ఇకపోతే మంచి ఎక్కడ ఉన్నా దానిని స్వీకరించాలి. సనాతనమంతా మూఢాచారమయమని, అధునాతనమంతా ప్రగతి శీలమైనదని భావించడం పొరపాటు. మన దేశ సంస్కృతి బూజుపట్టినదని, పాశ్చాత్య సంస్కృతి ప్రగతి శీలమైనదని భావించడం అవివేక మన్నారు. మంచిని గ్రహించి, చెడును వదలి వేయడం మంచిదని చెబుతూ " Your children and my children, quarrled with our children" అనే సంస్కృతికి దాసోహం కారాదని హెచ్చరించారు. ఇంటి పనులను నిర్వహించుకొని ప్రతి స్త్రీ రోజుకు ఎంతో కొంత సమయం సమాజహిత కార్యక్రమాల కోసం వెచ్చించాలని, గ్రామీణ స్త్రీలలో చైతన్యం కలుగజేయాలని చెప్పారు. కొంతమంది ఇండ్లలో చెడ్డ సాహిత్యం చోటు చేసుకోవడంవలన బాల బాలికలు దుష్ప్రభావానికి లోనవుతున్నారని ఆవేదనను వెలిబుచ్చారు. ప్రతి ఇల్లు మంచి సాహిత్యంతో నిండిపోవాలని, జాతి భవిష్యత్తును తీర్చిదిద్దే బాలబాలికలకు మంచిని రంగరించిపోయాలని, అంతటి శక్తి సామర్థ్యములను ప్రతి స్త్రీ సంపాదించాలని అదే నిజమైన చైతన్యమని పేర్కొంటూ, సాంఘిక దురాచారాలు చట్టాల ద్వారా అరికట్టలేమని, మానసిక పరివర్తన ద్వారానే వాటిని రూపుమాపవచ్చునని చెబుతూ, తన పిల్లలకు కట్నము తీసుకోమని సభాముఖంగా కామరగిరి ప్రకటించారు.

కామరగిరి రచించిన "మగువ బ్రతుకు" గేయమును శ్రీమతి కామరగిరి జయప్రద పాడి వినిపించారు. వి. ఉషారాణి స్వాగతం పలికారు. పి. సంధ్యారాణి వందన సమర్పణ చేసారు.

- పి. జి. కె. ★